జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# అడ్జస్ట్ ఎవిరీవేర్

మూల గుజరాతి సంకలనం - డా.నీరు బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మగణం

**ప్రకాశకులు :** అజీత్ సి.పటేల్
దాదా భగవాన్ విజ్ఞాన్ ఫౌండేషన్
1, వరుణ్ అపార్ట్‌మెంట్, 37,శ్రీమాలి సొసైటీ
నవరంగ్‌పురా పోలీస్ స్టేషన్ ఎదురుగా,
నవరంగ్‌పురా, అహ్మదాబాద్ - 380009
గుజరాత్, భారత్
ఫోన్: + 91 7935002100, +91 9328661166/77



మొదటి ముద్రణ : October 2015 (1500 Copies)

రెండవ ముద్రణ : December 2025 ( 500 Copies )

భావ మూల్యం : 'పరమ వినయం', మరియు "నాకు ఎంతమాత్రం తెలియదు. అదే భావన

ధర : 50 Rs

ముద్రిక : అంబా మల్టి ప్రింట్
హెచ్.బి.కపాడియా న్యూ హైస్కూల్ ఎదురుగా,
ఛత్రల్-ప్రతాప్పురా రోడ్, ఛత్రల్,
తాలూకా. కలోల్, జిల్లా.
గాంధీనగర్ - 382729, గుజరాత్.
ఫోన్: +91 79 3500 2142

ISBN/eISBN : 978-93-86289-93-3

**Printed in India**

# త్రిమంత్రం



నమో అరిహంతాణం

నమో సిద్ధాణం

నమో ఆయరియాణం





నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వేసిం,

పడమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద



# దాదా భగవాన్ ఎవరు?

అది జూన్ 1958 లో ఒక సాయంత్రం సమయం సుమారు 6:00, ప్రదేశం రద్దీగా ఉన్న సూరత్ పట్టణ రైల్వే స్టేషన్‌లో ప్లాట్‌ఫార్మ్ నం.3.లో బెంచీ మీద కూర్చునివున్న శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్ అనే దేహమందిరంలో, ప్రకృతిపరంగా, అక్రమ రూపంలో, ఎన్నో జన్మలుగా వ్యక్తమయ్యేందుకు ఆత్రుతగా ఎదురుచూస్తున్న 'దాదా భగవాన్' పూర్ణ రూపంలో ప్రకటితమయ్యారు, ఆధ్యాత్మిక అద్భుతంలా. ఒక గంట సమయంలోనే ఆయనకు విశ్వ దర్శనం అయింది. "నేనెవరు? భగవంతుడు ఎవరు? విశ్వాన్నంతా ఎవరు నడిపిస్తున్నారు? కర్మ అంటే ఏమిటి? ముక్తి అంటే ఏమిటి?" ఇలాంటి ప్రపంచంలో ఆధ్యాత్మిక ప్రశ్నలన్నిటికీ సమాధానం వచ్చింది. ఈ విధంగా దైవం, విశ్వానికి సంబంధించిన ఒక అద్వితీయమైన పూర్ణ స్వరూప దర్శనం కావించింది, దాని ఫలస్వరూపమే శ్రీ అంబాలాల్ మూల్జీ భాయ్ పటేల్, గుజరాత్‌లోని చరోతర్ క్షేత్రంలోని భాదరణ్ గ్రామంలో పాటీదార్, ఒక కాంట్రాక్ట్ పని చేసే వ్యక్తి, అయినా కూడా సంపూర్ణ వీతరాగ పురుషుడు.

"వ్యాపారంలో ధర్మం పాటించాలి కాని, ధర్మాచరణలో వ్యాపారం చేయగూడదు" అనే సిద్ధాంతంతోనే ఆయన జీవితమంతా గడిపారు. ఆయన ఎప్పుడూ ఎవరి దగ్గరి నుంచీ డబ్బు తీసుకోలేదు సరికదా తన ఆదాయం నుంచే తీర్థయాత్రలు చేసే భక్తులకు ఆర్థిక సహాయం చేసారు.

ఆ విధంగా ఆయనకు కేవలం రెండు గంటలలోనే సిద్ధించిన అద్భుతమైన జ్ఞానాన్ని ఉపయోగించి, ఆయన ఎందరో ముముక్షువులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించారు. దాన్ని ఆయన అక్రమ మార్గం అని అన్నారు. అక్రమ అంటే ఒక క్రమం లేని అర్థం. క్రమం అంటే ఒక మెట్టు పైన మరో మెట్టుని క్రమంగా ఎక్కుతూ వెళ్ళటం. అక్రమ మార్గమంటే షార్ట్‌కట్‌లో లిఫ్ట్ ద్వారా పైకి చేరుకోవటం.

ఆయన "దాదా భగవాన్ ఎవరు" అన్న రహస్యాన్ని స్వయంగా చెప్తూ, "మీ ముందు కనిపిస్తున్న ఈ ఆకారం దాదా భగవాన్ కాదు. ఈయన ఎ.ఎమ్.పటేల్. మేము ఒక జ్ఞానపురుషుడను, లోపల ప్రకటితమైనది దాదా భగవాన్. దాదా భగవాన్, 14 లోకాలకు నాధుడు. ఆయన మీలో కూడా ఉన్నాడు. అందరిలోనూ ఉన్నాడు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, నాలో సంపూర్ణ రూపంలో వ్యక్తమై ఉన్నాడు. ఆ దాదా భగవాన్ గారికి నేను కూడా ప్రణామం చేస్తాను"



# ఆత్మజ్ఞానానికి ప్రత్యక్ష లింక్

"నేను నా చేతులతో కొందరికి సిద్ధిని ప్రసాదించబోతున్నాను. నా తర్వాత ముందుకు నడిపేవాళ్ళు ఉండాలి కదా! నా తర్వాత కూడా మనుషులకు మార్గం చూపించేవాళ్ళుండాలి కదా!"

–దాదాశ్రీ

పరమ పూజ్య దాదాశ్రీ పల్లెపల్లెకు దేశవిదేశాలలో తిరుగుతూ ముముక్షువులకు సత్సంగం, ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగిస్తూవచ్చారు. వీరు తమ జీవితకాలంలోనే పూజ్య డా.నీరు బెహన్ అమీన్ (నీరూ మా) కి ఆత్మజ్ఞానాన్ని కలిగించి జ్ఞానసిద్ధిని ప్రసాదించారు. దాదాశ్రీ దేహాన్ని చాలించిన తర్వాత నీరూ మా, ముముక్షువులకు సత్సంగం, ఆత్మజ్ఞాన ప్రాప్తిని నిమిత్త భావనతో చేస్తూవస్తున్నారు. పూజ్య దీపక్ భాయ్ దేశాయ్‌కి దాదాశ్రీ, సత్సంగాన్ని నిర్వహించే సిద్ధిని ప్రసాదించారు. నీరు మా సమక్షంలోనే, ఆమె ఆశీర్వాదంతోనే పూజ్య దీపక్ భాయి దేశవిదేశాలలో ఎన్నో ప్రాంతాలకు వెళ్ళి, ముముక్షువులకు ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించి వచ్చారు. ఆ పని ఇప్పటికీ నీరూమా దేహాంతం తర్వాత కూడా కొనసాగుతూనేవుంది. ఆత్మజ్ఞాన ప్రాప్తి తర్వాత ఎందరో ముముక్షువులు ప్రపంచంలో ఉంటూ, తమ తమ బాధ్యతలను సక్రమంగా నెరవేరుస్తూ, ముక్త పురుషులుగా ఆత్మానందాన్ని అనుభవిస్తున్నారు.

ఈ గ్రంథంలో ముద్రితమైన వాణి, మోక్షార్థుల మార్గదర్శనంలో ఎంతో ఉ పయోగకరం. కానీ, మోక్షప్రాప్తి కోసం ఆత్మజ్ఞానాన్ని పొందటం అవసరం. అక్రమ మార్గంలో ఆత్మజ్ఞానాన్ని పొందేందుకు ఇప్పటికీ మార్గం తెరిచేవుంది. దీపకళిక మరో దీపాన్ని వెలిగించినట్లుగానే, ప్రత్యక్షంగా ఆత్మజ్ఞాని నుంచే ఆత్మజ్ఞాన ప్రాప్తిని కలిగించుకొని తన ఆత్మను జాగృతం చేసుకోవచ్చు.



# విన్నపం

జ్ఞాని పురుషులు పూజ్య దాదాభగవాన్ శ్రీముఖం నుంచి వెలువడ్డ ఆధ్యాత్మిక, వ్యావహారిక జ్ఞానానికి సంబంధించిన వాణిని రికార్డ్ చేసి, దానిని సంకలన సంపాదకీయాలతో పుస్తక రూపంలో ప్రచురించటం జరుగుతుంది. వివిధ విషయాల మీద వెలువడిన అద్భుతమైన సారస్వత సంకలనాన్ని ఈ పుస్తకాలలో చూస్తారు. అవి కొత్తగా చేరిన పాఠకులకు కూడా ఒక వరంలా పనిచేస్తుంది.

ఈ అనువాదాలలో, స్వయంగా దాదాజీ వాణిలాగానే వినిపించే విధంగా ఉండేందుకు విశేష ప్రయత్నాలు జరిగాయి. ఈ కారణంగా కొన్ని సందర్భాలలో తెలుగు వ్యాకరణానికి భిన్నంగా ఉందనిపించవచ్చు. కానీ, దాని వెనుకనున్న లక్ష్యాన్ని పరిగణనలోకి తీసుకుంటే ప్రయోజనకరంగా ఉంటుంది.

ఈ పుస్తకంలో ఎన్నో చోట్ల నిఘంటువులలోని వాక్యాలు కాక, దాదాశ్రీ ఉపయోగించిన వ్యాక్యాలను ఎక్కువ స్పష్టత రావటం కోసం తీసుకుని రాయటం జరిగింది. అందువలన కొన్ని చోట్ల ఇంగ్లీషు పదాలనే దీనికి మూలమైన హిందీ పుస్తకంలో హిందీ పదాలలా రాయటం జరిగింది. అదే దాదాశ్రీ శ్రీముఖం నుంచి వెలువడిన గుజరాతీ మాటలనైతే యథాతథంగా ఇటాలిక్స్‌లో రాయటం జరిగింది. ఎందుకంటే, వాటికి సమానమైన, వాటి పూర్తి అర్థాన్నిచ్చే హిందీ పదాలు లేవు కనుక. కాకపోతే వాటికి దగ్గర్లో ఉన్న హిందీ పదాలను ఆ పుస్తకాలలో చివర్లో ఇచ్చారు.

ఒక జ్ఞాని వాక్యాలను హిందీలో అనువాదం చేయటానికి వారి వంతు ప్రయత్నం చేసామని చెప్తున్నారు. అదే ప్రయత్నం తెలుగులో కూడా జరిగింది. కాకపోతే దాదాశ్రీ అందించిన ఆత్మజ్ఞానాన్ని యథాతథంగా పొందాలంటే, దాన్ని గుజరాతీలో చదివితేనే ఆ పని పూర్తిగా జరుగుతుంది. జ్ఞానపు లోతులలోకి వెళ్ళాలంటే, ఆ వాక్యాలలోని మర్మాన్ని పూర్తిగా అవగతం చేసుకోవాలంటే గుజరాతీ భాషను నేర్చుకోమని మేమివ్వగల సలహా.

అనువాదంలోని లోపాలకు మమ్మల్ని క్షమించవలసిందిగా ప్రార్థన.



# సంపాదకీయం

జీవితంలో ప్రతి సందర్భంలోను మనంతట మనం తెలివిగా ఎదుటివారితో అడ్జస్ట్ అవకపోతే భయంకరమైన ఘర్షణలు జరుగుతూనేవుంటాయి. జీవితం విషమయం అవుతుంది. చివరకు జగత్తు మనచేత బలవంతంగా అడ్జస్ట్‌మెంట్ చేయిస్తుంది. ఇష్టమున్నా లేకపోయినా మనం అవసరాన్నిబట్టి అడ్జస్ట్ అయితే అవుతూనేవుండవలసివస్తుంది. అలాంటప్పుడు అర్థం చేసుకునే అడ్జస్ట్‌మెంటు ఎందుకు చేసుకోగూడదు, దానితో ఘర్షణలు తొలగిపోయి సుఖ శాంతులు కలుగుతాయి కదా.

లైఫ్ ఈజ్ నథింగ్ బట్ అడ్జస్ట్‌మెంట్ (జీవితం అడ్జస్ట్‌మెంట్ తప్ప మరేమీ కాదు). పుట్టిన దగ్గరి నుంచి చనిపోయేంతవరకు అడ్జస్ట్‌మెంట్స్ చేసుకుంటూనే వుండాలి– నవ్వుతూ చేసినా ఏడుస్తూ చేసినా. చదువంటే ఇష్టమున్నా లేకపోయినా అడ్జస్ట్ అవుతూ చదవాలి. పెళ్ళి సంతోషంగా చేసుకున్నా కాని, జీవితమంతా భార్యాభర్తలు పరస్పరం అడ్జస్ట్‌మెంట్స్ చేసుకుంటూవుండాలి. రెండు విభిన్న ప్రకృతులు కలిగిన మనుషులు జీవితమంతా కలిసివుంటూ, వాళ్ళ పాలపడిందేదో నిర్వర్తిస్తూనేవుండాలి. ఇందులో ఒకరికొకరు జీవితమంతా పూర్తిగా అడ్జస్ట్‌మెంట్ చేసుకుంటూ గడిపే పుణ్యాత్ములు ఈ కాలంలో ఎంతమంది ఉండవచ్చు? అరె, రామచంద్ర మూర్తి, సీతాదేవి మధ్యలో కూడా ఎన్నోసార్లు డిస్అడ్జస్ట్‌మెంట్ జరగలేదా? బంగారు లేడి, అగ్ని పరీక్ష, గర్భవతిగా వనవాసం? వాళ్ళు ఎటువంటి అడ్జస్ట్‌మెంట్స్ చేసుకునివుండాలి?

తల్లిదండ్రులు, సంతానంతో అడుగడుగునా అడ్జస్ట్‌మెంట్స్ చేసుకోవలసి వుండదా? అవగాహనతో అడ్జస్ట్‌మెంట్ అయితే శాంతి లభిస్తుంది, కర్మ బంధం పడకుండా ఉంటుంది. కుటుంబంలో మిత్రులతో, వ్యాపారంలో బాస్‌తో, వ్యాపారి దళారులతో, మార్కెట్ ఆటుపోట్లతో, అన్ని చోట్ల మనం అడ్జస్ట్‌మెంట్ చేసుకోకపోతే, ఎన్ని బాధలు వచ్చిపడతాయి!

అందుకే 'అడ్జస్ట్ ఎవరివేర్' అనే 'మాస్టర్ కీ' ని తీసుకుని మనిషి తన జీవితం గడిపినట్లయితే, ఆ మనిషి జీవితంలో ఏ తాళమైనా తెరుచుకోకపోవటం అనేదే ఉండదు. జ్ఞానిపురుష్, పరమ పూజ్యనీయ దాదాశ్రీ ఇచ్చిన సువర్ణ సూత్రం, 'అడ్జస్ట్ ఎవిరివేర్' ని జీవితంలో సొంతం చేసుకుంటే ఇక ప్రపంచమంతా సుఖమయం అవుతుంది.

జై సచ్చిదానంద

**-డా.నీరు బెహన్ అమీన్**

## దాదా భగవాన్ నిర్వచించిన

# "అడ్జస్ట్ ఎవిరీవేర్"

### ఈ ఒక్క మాటని జీర్ణించుకోండి

**ప్రశ్నకర్త :** ఇక జీవితంలో నేను శాంతి, సరళమైన మార్గాన్ని కోరుకుంటున్నాను.

**దాదాశ్రీ :** ఒకే మాటను జీవితంలో అన్వయించుకుంటావా, సరిగ్గా అలాగే, ఎగ్జాక్ట్?

**ప్రశ్నకర్త :** ఎగ్జాక్ట్! ఆ.

**దాదాశ్రీ :** 'అడ్జస్ట్ ఎవిరీవేర్' ఈ మాత్రం మాటనుగనక మీరు మీ జీవితంలో అన్వయించుకుంటే అది ఎక్కువే. మీకు దానంతటదే శాంతి లభిస్తుంది. మొదట్లో ఆరు నెలల వరకు అడ్డంకులు వస్తాయి, తర్వాత దానంతటదే శాంతి కలుగుతుంది. మొదటి ఆరు నెలల వరకు రియాక్షన్ వస్తుంది, ఆలస్యంగా మొదలుపెట్టటం వలన. అందుకే, 'అడ్జస్ట్ ఎవిరివేర్'. ఈ కలియుగంలో ఇటువంటి భయంకరమైన కాలంలో మీరు అడ్జస్ట్ అవలేకపోతే, నశించిపోతావు!

ప్రపంచంలో మరింకేమీ రాకపోయినా పరవాలేదు కానీ అడ్జస్ట్ అవటమైతే రావాలిసిందే. ఎదుటివారు డిస్అడ్జెస్ట్ అవనీయండి కాని, మీరు మాత్రం అడ్జస్ అవుతూవుంటే సంసారసాగరాన్ని ఈది ఒడ్డుకి చేరుకుంటారు. ఇతరులతో అనుకూలంగా ఉండటం వచ్చినవారికి, ఎటువంటి బాధలూ ఉండవు. 'అడ్జస్ట్ ఎవిరీవేర్'! ప్రతి ఒక్కరితోను అడ్జస్ట్ అయినట్లయితే, అదే అన్నిటికన్నా పెద్ద ధర్మం. ఈ కాలంలో భిన్నభిన్న మనస్తత్వాలున్నప్పుడు, అడ్జస్ట్ అవకపోతే ఎలా నడుస్తుంది?

## జోక్యం చేసుకోవటం వద్దు, అడ్జస్ట్ అవాలి

సంసారానికి అర్థమే, సమసరణ మార్గమని. అందువలన నిరంతరం పరివర్తన చెందుతూనేవుంటుంది. కానీ పెద్దవాళ్ళు పాతకాలాన్నే పట్టుకుని వుంటారు. అరె, కాలంతో పాటు ముందుకెళ్ళు, లేకపోతే దెబ్బతింటావు! కాలానుగుణంగా అడ్జస్ట్‌మెంటు తీసుకోవాలి. నాకైతే దొంగతో, జేబు దొంగతో, అందరితో అడ్జస్ట్‌మెంట్ అయిపోతుంది. దొంగతో మాట్లాడితే, అతనికి కూడా తెలిసిపోతుంది, ఇతను కరుణామయుడని. నేను అతనితో 'నువ్వు తప్పు చేస్తున్నావు' అని అనను. ఎందుకంటే అది అతని వ్యూపాయింటు (దృష్టికోణం). కాని జనం అతన్ని పనికిరానివాడు అని తిట్టిపోస్తారు. ఏం ఈ వకీళ్ళు అబద్ధాలాడరా? 'పూర్తిగా తప్పుడు కేసుని కూడా గెలిపిస్తాను' అని ఎవరైతే అంటారో వాళ్ళు మోసగాళ్ళు అనిపించుకోరా? దొంగని ఎవరైతే 'లుచ్ఛా' అంటారో, అటువంటి వాళ్ళు అబద్ధపు కేసుని 'నిజం' అంటారు. అలాంటివాళ్ళని ప్రపంచంలో ఎలా నమ్మగలుగుతాం? కానీ అతని మాట కూడా నడుస్తుంది కదా? ఎవరినీ మనం తప్పు పట్టలేము. అతను తన 'వ్యూపాయింట్' లో కరెక్టే. కాని అతనికి నిజం ఏమిటో తెలియజేయండి, 'నువ్వీ దొంగతనం చేస్తున్నావు కదా, దాని పర్యవసానం ఏమిటో తెలుసా?' అని.

ఈ పెద్దవాళ్ళు ఇంట్లో అడుగుపెడుతూనే అంటారు, 'ఇది ఇనప్పెట్టా? ఇది రేడియోనా? ఇది ఇలా ఎందుకుంది? అది అలా ఎందుకుంది?' అలా జోక్యం చేసుకుంటూవుంటారు. అరె, ఎవరైనా యువకునితో స్నేహం చెయ్యి.

కాలం ఇలా మారుతూనేవుంటుంది. అలా లేకపోతే ఎలా జీవిస్తారు? ఏదైనా కొత్తది చూడగానే మోహం కలుగుతుంది. కొత్తదనం లేకపోతే జీవించేదెలా? అలా కొత్తదనం ఎన్నోసార్లు వచ్చింది, పోయింది. అందులో మీరు జోక్యం చేసుకోగూడదు. ఈ ప్రపంచం ఉల్టా నడుస్తోందా లేక సీదానా అని బాగా ఆలోచించాను. ఇక అర్థమైంది ఏమిటంటే, ఈ ప్రపంచాన్ని మార్చే శక్తి ఎవరికీ లేదని. అయినా నేనంటాను, ఈ ప్రపంచానికి అనుగుణంగా అడ్జస్ట్ అవమని. కొడుకు కొత్త టోపీ ఒకటి కొనుక్కుని వచ్చినట్లయితే, 'ఇలాంటిది ఎక్కడి నుంచి పట్టుకొచ్చావు?' అని అనకండి. దాని బదులు అడ్జస్ట్ అయ్యి, 'ఇంత మంచి టోపీ ఎక్కడి నుంచి తెచ్చావు? ఎంతకి తెచ్చావు? చాల చౌకలో దొరికిందా?' అనండి. అలా అడ్జస్ట్ అవండి.

మన ధర్మం ఏమంటుంది? అసౌకర్యంలో సౌకర్యాన్ని వెతుకు అని. రాత్రి నాకు ఆలోచన వచ్చింది, 'ఈ దుప్పటి మురికిగా ఉంది' అని. కానీ అడ్జస్ట్ అయిన తర్వాత ఎంత హాయిగా ఉందంటే అడక్కు మరి! పంచేంద్రియ జ్ఞానం అసౌకర్యాలను చూపిస్తుంటుంది, ఆత్మజ్ఞానం సౌకర్యాన్ని చూపిస్తుంది. అందువలన ఆత్మలో ఉండండి.

## దుర్గంధంతో అడ్జస్ట్‌మెంట్

బాంద్రా (ముంబైలో ఒక ప్రదేశం) కాలువ నుంచి దుర్గంధం వస్తుంటే దానితో దెబ్బలాటకి పోతారా ఏమిటి? అలాగే మనుషులు కూడా దుర్గంధాన్ని వ్యాపింపజేస్తారు. మరైతే వాళ్ళని ఏమైనా అనటానికి పోతారా? దుర్గంధాన్ని వెదజల్లేవారు మురుగు కాలువలు అనిపించుకుంటారు, సుగంధాన్ని వెదజల్లేవారు పూదోటలాంటివాళ్ళు. దుర్గంధాన్ని వెదజల్లేవారంతా 'మా పట్ల వీతరాగులై ఉండండి!' అంటారు.

మంచీ చెడూ అని చెప్పబోతే మనకి ఇబ్బందులు కలిగిస్తారు. మనం ఆ రెండిటినీ సమానంగా చూడాలి. ఇతన్ని 'మంచి' అంటే, అతను 'చెడ్డ' అవుతాడు. ఇక అతను మనల్ని సతాయిస్తాడు. కానీ, ఇద్దరినీ 'మిక్చర్' చేసేస్తే, ఇక ఎటువంటి

ప్రభావమూ పడదు. నేను 'అడ్జస్ట్ ఎవిరీవేర్' అనేదాన్ని శోధించి పట్టుకున్నాను. నిజం చెప్తుంటే అతనితోను, ఎవరైనా అబద్ధమాడుతుంటే అతనితోనూ 'అడ్జస్ట్' అయిపో. నన్నెవరైనా, 'నీకసలు తెలివి లేదు' అని అంటే, నేను వెంటనే అతనితో అడ్జస్ట్ అయిపోయి, అతనితో, 'అదైతే ముందు నుంచీ లేదు. నీవు ఈ రోజు ఎక్కడి నుంచి కనిపెట్టావు వచ్చి? నీకు ఇప్పుడు తెలిసింది కానీ, నాకు చిన్నప్పటి నుంచీ తెలుసు'. అంటాను. అలా అంటే ఇక గొడవే ఉండదు కదా? ఇక అతను నాలో తెలివిని వెతికేందుకు రానేరాడు. అలా చెయ్యకపోతే 'నేను నా ఇంటికి (మోక్షానికి) ఎప్పుడు పోతాను?

## పత్నితో అడ్జస్ట్‌మెంట్

**ప్రశ్నకర్త :** ఎలా అడ్జస్ట్ అవాలి? ఇది కాస్త వివరించండి.

**దాదాశ్రీ :** ఏ కారణం చేతనైనా ఎప్పుడైనా ఆలస్యమై, భార్య ఏమైనా ఉల్టాసీదా అనటం మొదలుపెట్టిందనుకోండి, 'ఇంత ఆలస్యంగా వచ్చావేం? ఇలా చేస్తే నాకు కుదరదు' అలా ఏవోవే అంటూ, ఆమెకి తల తిరుగుతుంటే, మీరు, 'ఔను నీవనేది నిజమే. పొమ్మంటే వెనక్కి తిరిగి వెళ్ళిపోతా, రమ్మంటే లోపలికి వచ్చి కూర్చుంటా' అంటే, ఆమె, 'లేదు వెనక్కి తిరిగి పోకండి. ఇక్కడ పడుకో మాట్లాడకుండా' అంటుంది. మళ్ళీ అనండి, 'నువ్వు చెప్తే తింటాను లేకపోతే పడుకుంటా' అని. అప్పుడామె, 'లేదు తినండి' అంటే, ఆమె మాట విని మీరు తినండి. అంటే అడ్జస్ట్ అయిపోయింది. మరి పొద్దున్నే ఫస్ట్ క్లాస్ టీ ఇస్తుంది. ఒకవేళ దబాయిస్తే, ముఖం మాడ్చుకుని టీ కప్పునిస్తుంది, అదే పరిస్థితి మూడు రోజుల వరకు నడుస్తుంది.

## పొంగలి తింటావా లేక హొటల్ పిజ్జానా?

అడ్జస్ట్ అవటం రాకపోతే ఏం చేస్తారు? భార్యతో జగడం పెట్టుకుంటారు. ఔనా కాదా?

**ప్రశ్నకర్త :** ఔను.

**దాదాశ్రీ :** ఔనా? ఎందుకు పంపకాలు చేసుకుంటారా? వైఫ్‌తో ఏం పంపకాలు చేసుకుంటారు? ఆస్తులైతే ఉమ్మడిగానే ఉన్నాయి.

**ప్రశ్నకర్త :** భర్తకి గులాబ్‌జామున్ తినాలనివుండి భార్య పొంగలి చేస్తే మరి జగడమౌతుంది.

**దాదాశ్రీ :** మరి జగడం జరిగిన తర్వాత గులాబ్‌జామున్ చేసిపెడుతుందా? లేదే! ఆ తర్వాత కూడా తినాల్సింది పొంగలే కదా!

**ప్రశ్నకర్త :** అప్పుడు హెూటల్ నుంచి పిజ్జా తెప్పిస్తాము.

**దాదాశ్రీ :** ఔనా? అంటే ఇదీ పోయింది, అదీ పోయింది. పిజ్జా అయితే వస్తుంది కదూ? కానీ గులాబ్‌జామున్ పోయిందికదా! దానిబదులు మీరు వైఫ్‌తో, 'నీకు ఏది నచ్చితే అది చెయ్యి' అని ఉంటే, ఆమెకి కూడా ఏదో ఒక రోజు చేసిపెట్టే ఆలోచన వస్తుంది కదా? ఆమె తినదా? అందుకని, 'నీకు ఏది బాగనిపిస్తే అది చెయ్యి' అని అంటే, 'లేదు, మీకు ఏది నచ్చితే అది చేస్తాను' అంటుంది. అప్పుడు మీరు, 'గులాబ్‌జామున్ చెయ్యి' అనండి. మీరు ఒకవేళ ముందే గులాబ్‌జామున్ చెయ్యమని అంటే ఆమె, 'లేదు నేను పొంగలి చేస్తాను' అంటుంది.

**ప్రశ్నకర్త :** అలా అభిప్రాయ భేదాలు రాకుండా ఉండటానికి మీరు మార్గమేం సూచిస్తారు?

**దాదాశ్రీ :** నేను సూచించే మార్గం ఇదే, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'. ఆమె 'పొంగలి చేస్తాను' అంటే, మీరు 'అడ్జస్ట్' అయిపోండి. మీరు ఒకవేళ, 'మనం బయటకు పోదాం. సత్సంగానికి వెళ్ళాలి' అని అంటే, ఆమె 'అడ్జస్ట్' అవాలి. ఎవరు ముందు అంటే వాళ్ళతో అడ్జస్ట్ అయిపోవాలి.

**ప్రశ్నకర్త :** ఇక ముందు అనటానికి జగడాలు అవుతాయి.

**దాదాశ్రీ :** ఆ. అలా చెయ్యండి. కానీ, ఆమెతో 'అడ్జస్ట్' అవండి.

ఎందుకంటే, మీ చేతిలో ఏమీ లేదు. ఆ అధికారం ఎవరి చేతిలో ఉందన్నది నాకు తెలుసు. ఇక మరి 'అడ్జస్ట్' అవటంలో అభ్యంతరం ఏమిటి బాబూ?

**ప్రశ్నకర్త :** లేదు. ఏమాత్రం లేదు.

**దాదాశ్రీ :** చెల్లెమ్మా, నీకేమైనా అభ్యంతరమా?

**ప్రశ్నకర్త :** లేదు.

**దాదాశ్రీ :** సరే ఇక మరి దాన్ని తీసేయండి. 'అడ్జస్ట్ ఎవిరీవేర్'. ఇందులో ఏమైనా అభ్యంతరం ఉందా?

**ప్రశ్నకర్త :** లేదు. ఏమాత్రం లేదు.

**దాదాశ్రీ :** ఒకవేళ ఆయన ముందుగా, 'ఈరోజు ఉల్లిపాయ పకోడి, లడ్డూ, కూర అన్నీ చెయ్యి' అంటే మీరు అడ్జస్ట్ అవండి. ఒకవేళ మీరు, 'ఈరోజు త్వరగా పడుకోవాలి' అంటే ఆయన అడ్జస్ట్ అవాలి. (భర్తతో) మీకు ఏవరైనా స్నేహితుడి ఇంటికి పోవలసివున్నా, దాన్ని వాయిదా వేసి త్వరగా పడుకోండి. ఎందుకంటే, స్నేహితుడితో గొడవ జరిగితే తర్వాత చూసుకోవచ్చు కానీ, ఇక్కడ ఇంట్లో వద్దు. మనుషులు స్నేహితునితో సంబంధం బాగుండేందుకు ఇంట్లో గొడవ పెట్టుకుంటారు. అలా చెయ్యగూడదు. అంటే ఆమె ముందుగా ఏమంటే దానికి అడ్జస్ట్ అవాలి.

**ప్రశ్నకర్త :** కానీ భర్తకి ఎనిమిది గంటలకు ఏదైనా మీటింగ్‌కి పోవలసివుంటే, భార్యేమో, 'ఇక పడుకోండి' అంటే, అప్పుడేం చెయ్యాలి?

**దాదాశ్రీ :** అటువంటి ఊహలే వద్దు. ప్రకృతి నియమం ఏమిటంటే, 'వేర్ దేరీజ్ ఎ విల్, దేరీజ్ ఎ వే' (అనుకుంటే మార్గం దొరుకుతుంది). ఊహల్లోకి వెళ్తే వ్యవహారం చెడుతుంది. ఆరోజు ఆమె కూడా అంటుంది, 'త్వరగా రండి' అని. స్వయంగా గ్యారేజ్ వరకు వస్తుంది పంపించటానికి. కల్పనల వలన అంతా చెడిపోతుంది. అందుకే ఒక పుస్తకంలో రాసివుంది, 'వేర్ దేరీజ్ ఎ విల్, దేరీజ్ ఎ వే' అని. ఈమాత్రం పాటిస్తే చాలు. పాటిస్తారు కదా?

**ప్రశ్నకర్త :** అలాగేనండి.

**దాదాశ్రీ :** సరే ప్రామిస్ చెయ్యి! వాహ్! దీన్నే అంటారు శూరత్వం అని! ప్రామిస్ చేసారు!

## భోజనంలో అడ్జస్ట్‌మెంట్

వ్యవహారం చక్కబెట్టటం అని దేన్ని అంటారంటే, 'అడ్జస్ట్ ఎవిరీవేర్' జరిగినప్పుడు. ఇది డెవలప్‌మెంట్ కాలం. అభిప్రాయభేదాలు ఉండకూడదు. అందుకే నేను అందరికీ ఈ సూత్రాన్ని ఇచ్చాను, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'! అడ్జస్ట్, అడ్జస్ట్, అడ్జస్ట్. ఒకవేళ మజ్జిగ చారులో ఉప్పు ఎక్కువయిందనుకోండి, దాదాజీ, అడ్జస్ట్‌మెంట్ తీసుకోమని చెప్పారు అని అర్థం చేసుకోండి. మరి కొద్దిగా మజ్జిగ చారు తినండి. ఆ, పచ్చడి గుర్తుకొస్తే అడగండి, 'కాస్త పచ్చడి తీసుకురా' అని. అంతేకాని గొడవపెట్టుకోవద్దు. ఇంట్లో గొడవలు ఉండకూడదు. మీరు ఎక్కడైనా చికాకుల్లో పడితే, మీరే అడ్జస్ట్ అవండి. అప్పుడు ప్రపంచమంతా సుందరంగా కనపడుతుంది.

## సరిపడకపోయినా సరే సర్దుకుపో

మీతో ఎవరెవరైతే డిస్‌అడ్జెస్ట్ అవటానికి వస్తారో, వాళ్ళతో నువ్వు అడ్జస్ట్ అయిపో. రోజువారీ జీవితంలో అత్త కోడళ్ళ మధ్య, వదిన మరదళ్ళ మధ్య డిస్‌అడ్జస్ట్‌మెంట్స్ వస్తే, ఎవరికైతే ఈ ప్రపంచంలోని చక్రంలోంచి బయటపడ దలచుకున్నారో, వాళ్ళు అడ్జస్ట్ అవాలి. భార్యాభర్తలలో ఎవరైనా చీలిక తీసుకునివస్తే రెండవవారు దాన్ని అతికించే ప్రయత్నం చేస్తేనే సంబంధం నిలుస్తుంది, శాంతి నెలకొంటుంది. అడ్జస్ట్‌మెంట్ చేసుకోవటం రానివాళ్ళని అంతా మెంటల్ అంటారు. ఈ రిలేటివ్ సత్యంలో ఆగ్రహావేశాలు, పట్టుదలలకు ఏమాత్రం చోటు లేదు. 'మనిషి' అంటే ఎవరు? అన్నిచోట్లా అడ్జస్ట్ అవగలిగేవాడు. దొంగతో కూడా అడ్జస్ట్ అవాలి.

## మార్పు తేవాలా అడ్జస్ట్ అవాలా?

ప్రతి విషయంలోనూ మనం ఎదుటివారితో అడ్జస్ట్ అవగలిగితే, ఎంత సరళమౌతుంది అంతా! మనం వెంట తీసుకునిపోయేదేముంది? ఎవరైనా, 'భాయ్, భార్యని సరిచేయి' అంటే, 'అరె, ఆమెను తిన్నగా చేసే క్రమంలో నువ్వు వంకరైపోతావు. అందువలన భార్యను తిన్నగా చేయాలని అనుకోకు. ఆమె ఎలా ఉంటే అదే కరెక్ట్ అను. ఆమెతో ఎల్లప్పుడూ మీకు ఇచ్చిపుచ్చుకునేది ఉంటే అది వేరు కాని, ఇది ఒక జన్మ బంధమే కదా, ఆ తర్వాత ఎవరికి తెలుసు ఎక్కడికి పోతుందో. ఇద్దరి మరణ కాలాలు వేరు వేరు, ఇద్దరి కర్మలు వేరు వేరు! ఇచ్చేదేమీ లేదు, పుచ్చుకునేదేమీ లేదు. ఇక్కడి నుంచి ఆమె ఎవరి దగ్గరకు పోతుందో ఏం చెప్పగలం? మీరు ఆమెని తిన్నగా చెయ్యండి, మరు జన్మలో అది వేరే వాళ్ళ ఖాతాలోకి పోతుంది.

అందువలన ఆమెను మీరు సరిచేయటానికి చూడకండి, ఆమె కూడా మిమ్మల్ని సరిచేయటానికి చూడవద్దు. ఎలాంటివాళ్ళు దొరికినా వాళ్ళే బంగారం. ఎవరి మనస్తత్వం కూడా ఎప్పుడూ తిన్నగా ఉండదు. కుక్క వంకర తోక ఎప్పటికీ వంకరగానే ఉంటుంది. అందువలన మీరు జాగరూకతతో ముందుకు నడవండి. ఎలా ఉంటే అలాగే సరి 'అడ్జస్ట్ ఎవిరీవేర్'.

## భార్యది కౌంటర్‌వెయిట్

**ప్రశ్నకర్త :** నేను వైఫ్‌తో అడ్జస్ట్ అవటానికి చాల ప్రయత్నం చేస్తాను కానీ, అడ్జస్ట్ అవటం లేదు.

**దాదాశ్రీ :** అదంతా లెక్క ప్రకారం జరుగుతుంది. బోల్ట్ వంకరుంటే నట్ కూడా వంకరే ఉంటుంది. అక్కడ తిన్నగా తిప్పాలనుకుంటే ఎలా వీలౌతుంది? మీకు అనిపిస్తుండవచ్చు, 'స్త్రీజాతి అంతా ఇలా ఎందుకు ఉంది?' అని. కాని, స్త్రీజాతి మీకు కౌంటర్ వెయిట్. మీ దోషం ఎంత ఉంటే, ఆమె అంత తేడాగా ఉంటుంది. అందుకే నేనంటాను 'అంతా వ్యవస్థితం' అని.

**ప్రశ్నకర్త:** అందరూ నన్ను సరిచేయటానికే వచ్చారని అనిపిస్తోంది.

**దాదాశ్రీ:** మిమ్మల్ని సరిచేయాల్సిందే. సరిచేయకపోతే ప్రపంచమే నడవదు కదా? తిన్నగా అవకపోతే తండ్రి ఎలా అవుతారు? తిన్నగా అయితేనే తండ్రి అవుతారు. స్త్రీ జాతి ఎలాంటిదంటే, 'ఆమె మారదు కనుక మనమే మారాలి. అది సహజమైన జాతి. మారేదైతే కాదు'. 'వైఫ్' ఎవరామె?

**ప్రశ్నకర్త:** మీరు చెప్పండి.

**దాదాశ్రీ:** వైఫ్ ఈజ్ ద కౌంటర్ వెయిట్ ఆఫ్ మాన్. ఆ కౌంటర్ వెయిట్ లేకపోతే మనిషి కిందపడిపోతాడు.

**ప్రశ్నకర్త:** ఇది అర్థం కాలేదు.

**దాదాశ్రీ:** ఇంజన్‌లో కౌంటర్ వెయిట్‌ని పెడతారు. లేకపోతే ఇంజన్ నడుస్తూ నడుస్తూ పక్కకు పడిపోతుంది. అలాగే మగవాడికి కౌంటర్ వెయిట్ స్త్రీ. అంటే స్త్రీ ఉంటే కిందపడిపోడు. లేకపోతే ఉరుకులు పరుగులు పెట్టి కూడా గమ్యం అంటూ ఉండకుండా పోతుంది. ఈ రోజు ఇక్కడ మరురోజు ఎక్కడికి పోతాడో. స్త్రీ ఉండబట్టే ఇంటికి వస్తాడు. లేకపోతే ఇంటికి వస్తాడా?

**ప్రశ్నకర్త:** రాడు.

**దాదాశ్రీ:** 'స్త్రీ' అతనికి కౌంటర్ వెయిట్.

## జగడం, ఆఖరికి అంతం

**ప్రశ్నకర్త:** ఉదయం జరిగిన జగడాన్ని మధ్యాహ్నానికల్లా మర్చిపోతాం. సాయంత్రం మళ్ళీ కొత్తది మొదలౌతుంది.

**దాదాశ్రీ:** నాకు తెలుసు జగడం ఏ శక్తివలన జరుగుతుందో. ఆమె తేడాగా మాట్లాడుతుంది అంటే దాని వెనక ఏ శక్తి పనిచేస్తుంది? చెప్పిన తర్వాత 'అడ్జస్ట్' అయిపోతారు. అదంతా జ్ఞానంతో అర్థమౌతుంది. అయినా ప్రపంచంలో

అడ్జస్ట్ అవాలి. ఎందుకంటే ప్రతి ఒక్కటీ అంతమయ్యేదే. ఇది చాలాకాలం వరకు నడుస్తూనేవుంటుందనుకోండి, అయినా మీరు దానికి 'హెల్ప్' చేయలేరు సరికదా ఇంకా ఎక్కువ నష్టం కలిగిస్తారు. మీకు మీరు, ఎదుటివారికి కూడా నష్టం కలిగిస్తున్నారు.

## లేదంటే ప్రార్థనకి అడ్జస్ట్‌మెంట్

**ప్రశ్నకర్త:** ఎదుటివారికి తెలిసేటట్లుగా చెప్పటానికి నేను నా పురుషార్థం చేసాను. ఆ వ్యక్తి మరి అర్థం చేసుకున్నా చేసుకోకున్నా, అది ఆ వ్యక్తి పురుషార్థమా?

**దాదాశ్రీ:** మీ బాధ్యత అతనికి అర్థమయేటట్టుగా చెప్పటం వరకే. కాని అతను అర్థం చేసుకోకపోతే దానికే ఉపాయమూ లేదు. అప్పుడు మీరు ఇలా అనుకోండి, 'హే దాదా భగవాన్! అతనికి సద్బుద్ధినివ్వండి' ఆమాత్రం అనుకోవాలి. అతన్ని మధ్యలో వేలాడేటట్టు చేయవద్దు. ఇదేమీ ఒట్టిగా చెప్పే మాటలు కావు. ఇది 'దాదాజీ' 'అడ్జస్ట్‌మెంట్' విజ్ఞానం. అద్భుతమైనది ఈ 'అడ్జస్ట్‌మెంట్'. 'అడ్జస్ట్' అవలేరో, అక్కడ మీకు దాని రుచి తగిలేవుంటుంది. 'డిజెడ్జస్ట్‌మెంట్' మూర్ఖత్వమే. ఎందుకంటే అతను, 'నేను యాజమాన్యాన్ని వదిలిపెట్టలేను, నా అధికారమే ఉండాలి' అని అనుకుంటాడు కనుక. అలా అనుకుంటే జీవితాంతం పస్తులుంటాడు, ఏదో ఒక రోజు అతని జోలిలో 'పాయిజన్' వచ్చిపడుతుంది. సహజంగా నడుస్తున్నదాన్ని అలా నడవనీ. ఇది కలియుగం. వాతావరణం ఎలా ఉంది? అందువలన ఒకవేళ భార్య, 'మీరు పనికిరానివారు' అని అంటే, 'బాగా చెప్పావు' అనండి.

## తేడావాళ్ళతో అడ్జస్ట్ అయిపో

**ప్రశ్నకర్త:** వ్యవహారంలో ఉండాలి కనుక, 'అడ్జస్ట్‌మెంట్' ఏకపక్షంగా ఉండగూడదు కదా?

**దాదాశ్రీ:** అడ్జస్ట్ అయ్యేదాన్నే వ్యవహారం అంటారు. ఎందుకంటే పొరుగువారు కూడా 'అందరి ఇళ్ళల్లో జగడాలు జరుగుతుంటాయి కాని, ఈ

ఇంట్లో జగడాలుండవు' అనాలి. అలాంటి వ్యవహారం సర్వోత్తమమని అనిపించుకుంటుంది. ఎవరితోనైనా పడకపోతే అక్కడే శక్తులను వికసింపజేసుకోవాలి. అనుకూలంగా ఉన్న చోట శక్తి వుండనే వుంటుంది. ప్రతికూలమని అనిపించటమే బలహీనత. నాకు అందరితో అనుకూలత ఎందుకు ఉంటుంది? ఎంత అడ్జస్ట్‌మెంటు చేసుకుంటే, శక్తి అంత పెరుగుతుంది, అశక్తత వీడిపోతుంది. సరైన అవగాహన ఎప్పుడొస్తుందంటే, అన్ని రకాల అపార్థాలకు తాళాలు పడ్డప్పుడు.

మృదు స్వభావులతో ఎవరైనా అడ్జస్ట్ అయిపోతారు. కానీ, వంకర, కఠోర, ఆవేశపరులు ఇలా అందరితోనూ అడ్జస్ట్ అవటం వచ్చినట్లయితే పని నెరవేరుతుంది. ఎంతటి లుచ్ఛాతోనైనా సరే అడ్జస్ట్ అవటం వస్తే, తల తిరగకుండా ఉంటే, పని జరిగిపోతుంది. ఆవేశంతో రగిలిపోతే నడవదు. ప్రపంచంలో ఏదీ మనకి 'ఫిట్' అవదు. మనమే దానికి 'ఫిట్' అయితే ప్రపంచం అందంగా ఉంటుంది. కాని, దాన్నే మనం 'ఫిట్' చేద్దామని చూస్తే అది తేడాగా కనిపిస్తుంది. అందుకే, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'! మీరు దానికి 'ఫిట్' అయితే ఏ ఇబ్బందీ ఉండదు.

## డోంట్ సీ లా, సెటిల్!

ఎదుటి మనిషి వంకరైనా, 'జ్ఞాని' అయితే అతనితో అడ్జస్ట్ అయిపోతారు. 'జ్ఞాని పురుష్' ని చూసి అనుసరిస్తే, అన్ని రకాలుగా అడ్జస్ట్‌మెంట్లు నేర్చుకుంటారు. దాని వెనుక ఉన్న సైన్స్ ఏమంటుందంటే, 'వీతరాగివైపో. రాగద్వేషాలు వద్దు'. లోపల ఏదో కాస్త ఆసక్తి ఉండిపోతుంది, అందుకే దెబ్బతింటారు. వ్యవహారంలో ఏకపక్షంగా నిస్పృహ అయినట్లయితే వాళ్ళని వంకరవాళ్ళంటారు. మీకు అవసరం పడితే, ఎదుటి మనిషి వంకరవాడైనా అతన్ని ఒప్పించాలి. స్టేషన్‌లో కూలీతో పని పడ్డప్పుడు, అతను పేచీ పెట్టినా, నాలుగు అణాలు ఎక్కువ ఇచ్చయినా ఒప్పించవలసి వుంటుంది. అలా ఒప్పించకపోతే ఆ బ్యాగ్‌ని స్వయంగా ఎత్తుకుని పోవలసి వుంటుంది కదా.

డోంట్ సీ లాస్, ప్లీజ్ సెటిల్. ఎదుటి మనిషిని సెటిల్‌మెంట్ చేసుకోమని చెప్పి, 'మీరు ఇలా చెయ్యండి, అలా చెయ్యండి' అని చెప్పండి. అలా చెప్పటానికి సమయమెక్కడుంది? ఎదుటివారివి వంద తప్పులున్నా సరే, మీరు, 'తప్పు నాదే' అని ముందుకు సాగాలి. ఈ కాలంలో లా ని పట్టించుకుంటున్నారా? పరిస్థితి పూర్తిగా హద్దులకు చేరుకుంది. ఎక్కడ చూడు ఉరుకులు పరుగులు! జనమంతా చిక్కుపడిపోయారు. ఇంటికి పోతే భార్య ఫిర్యాదులు, పిల్లల ఫిర్యాదులు, పనికి పోతే సేఠ్ ఫిర్యాదులు, రైల్లో తొక్కిసలాటల్లో తోపుళ్ళు. ఎక్కడా ప్రశాంతత లేదు. ప్రశాంతత అనేది ఉండాలి కదా? ఎవరైనా దెబ్బలాటకు వస్తే వాళ్ళ మీద దయ కలగాలి, 'అరె, ఇతనిలో ఎంత వత్తిడి ఉందో దెబ్బలాటకు దిగాడు' అనుకోవాలి. చిరాకుపడ్డవాళ్ళంతా బలహీనులు.

## ఆరోపణలు? వద్దు, అడ్జస్ట్‌మెంటు

అదేమిటంటే, ఇంట్లో కూడా అడ్జస్ట్‌మెంట్ చేసుకోవటం రావాలి. మీరు సత్సంగం నుంచి ఇంటికి ఆలస్యంగా వెళ్తే ఇంట్లోవాళ్ళు ఏమంటారు? 'కాస్తోకూస్తో టైము మీద ధ్యాస ఉండాలి కదా!' అని. అలాంటప్పుడు మనం కాస్త త్వరగా ఇంటికి పోతే తప్పేమిటి? ఎద్దు ముందుకు నడవకపోతే నూనె గానుగతను ముల్లు కర్రతో గుచ్చుతాడు. దానికి బదులు అది ముందుకు పోతుంటే అతను గుచ్చడు కదా. అలా చెయ్యకపోతే గానుగతను ముల్లుగర్రతో గుచ్చుతాడు, అప్పుడు ముందుకు వెళ్ళాల్సివుంటుంది. ముందుకైతే నడవాలి కదా? మీరు చూసారా అది? కర్రకి చివర్లో మేకు ఉంటుంది. దానితో గుచ్చుతుంటాడు. నోరులేని ప్రాణి పాపం ఏం చేస్తుంది? ఎవరితో చెప్పుకుంటుంది?

వీళ్ళలో ఎవరికైనా ముల్లుగర్రతో గుచ్చితే కాపాడటానికి మనుషులు వస్తారు. కాని పాపం ఆ మూగ జీవి ఎవరికి ఫిర్యాదు చేస్తుంది? దానికి అలా దెబ్బలు తినాల్సిన అగత్యం ఎందుకు కలిగింది? ఎందుకంటే అంతకు ముందు అది చాలచాల ఫిర్యాదులు చేసింది. అందుకే వచ్చింది ఈ పరిణామం. అధికారంలో ఉన్నపుడు ఫిర్యాదులే ఫిర్యాదులు చేసింది. ఇప్పుడు అధికారం లేదు కనుక

ఫిర్యాదులేమీ చెయ్యకుండా ఉండాలి. అందుకే ఇప్పుడు 'ప్లస్–మైనస్' చేసెయ్యి. దానిబదులు ఫిర్యాదుచేసేవాడవి అవద్దు. అందులో తప్పేముంది? ఫిర్యాదులు చేస్తుంటేనే నేరస్తునిగా నిలబడే సమయం వస్తుంది. మనం నేరస్తులం, ఫిర్యాదులం కూడా కాకూడదు కదా. ఎదుటివారు తిడుతుంటే వాటిని జమ చేసుకో. ఫిర్యాదు చేయనేవద్దు. మీకమనపిస్తోంది? ఫిర్యాదీ అవటం మంచిదేనా? కానీ దానికి ముందు నుంచే 'అడ్జస్ట్' అయిపోతే తప్పేమిటి?

## ఉల్టా మాట్లాడిన తర్వాత

వ్యవహారంలో అడ్జస్ట్‌మెంట్ చేసుకోవటాన్ని ఈ కాలంలో 'జ్ఞానం' అంటారు. ఔను. అడ్జస్ట్‌మెంట్ చేసుకోవాలి. అడ్జస్ట్‌మెంట్ తెగిపోతుంటే కూడా అడ్జస్ట్‌మెంటు చేసుకోవాలి. మీరు ఆ మనిషిని ఇష్టమొచ్చినట్లు అనేసారు. ఇప్పుడు చెప్పండి ఇది మీరు చెయ్యలేరని. మీ నోటి నుంచి అలా వస్తుంది కదా ఎప్పుడైనా? అనేసారు కాని తర్వాత వెంటనే అర్థమైపోతుంది 'తప్పు జరిగిపోయింది' అని. అర్థమవకుండా అయితే ఉండదు. కానీ అప్పుడు మనం అడ్జస్ట్ చేయటానికి పోము. తర్వాత వెంటనే వెళ్ళి చెప్పాలి, 'భాయ్ ఆ సమయంలో నా నోటి నుండి అలా అనగూడని మాటలు వచ్చేసాయి, అది నా తప్పే, అందుకు క్షమించు' అని. అప్పుడు అడ్జస్ట్‌మెంట్ అయిపోతుంది. ఇందులో ఏమైనా కష్టం ఉందా?

**ప్రశ్నకర్త :** లేదు, కష్టమేమీ లేదు.

## అన్నిచోట్లా అడ్జస్ట్‌మెంటు

**ప్రశ్నకర్త :** ఒక్కోసారి ఏమౌతుందంటే, ఒకే సమయంలో ఇద్దరు వ్యక్తులతో ఒకే విషయం మీద అడ్జస్ట్ అవవలసివస్తే, అప్పుడు ఇద్దరితో అడ్జస్ట్‌మెంట్ ఎలా వీలౌతుంది?

**దాదాశ్రీ :** ఇద్దరితోనూ (అడ్జస్ట్‌మెంట్) చేసుకోవచ్చు. అరె, ఏడుగురితో అయినా చేసుకోవచ్చు. ఒకతను, 'నా పని ఏం చేసావు?' అని అడిగితే, 'భాయ్ మీరు చెప్పిన విధంగానే చేస్తాను' అనాలి. రెండవ మనిషికి కూడా అలాగే

చెప్పాలి, 'మీరు ఎలా చెప్పారో అలాగే చేస్తాను' అని. 'వ్యవస్థిత' నుంచి ఏదీ బయటకైతే పోలేదు. కాబట్టి ఏదైనా చెప్పి జగడాలు జరగకుండా చూడాలి. ముఖ్యమైనది 'అడ్జస్ట్‌మెంట్'. 'ఔను' అంటే ముక్తి. మనం 'ఔను' అన్నంత మాత్రాన అది 'వ్యవస్థిత' నుంచి బయటకు పోతుందా? కానీ 'లేదు' అంటే మాత్రం మహా– ఉపాధి !

ఇంట్లో భార్యాభర్తలిద్దరూ 'అడ్జస్ట్' అవాలి అని నిశ్చయించుకుంటే ఇద్దరికీ మంచిది. ఒకవైపు ఒకరు పట్టుకుని వెనక్కి లాగినపుడు మరొకరు 'అడ్జస్ట్' అయితే గొడవలు సమసిపోతాయి. ఒక మనిషి చెయ్యి నొప్పిగా ఉంది. కానీ, అతను ఎవరికీ చెప్పలేదు. రెండవ చేతితో ఆ చేతిని నొక్కుకుంటూ 'అడ్జస్ట్' చేసుకున్నాడు. ఈ విధంగా 'అడ్జస్ట్' అయితే అన్నీ సమసిపోతాయి. 'అడ్జస్ట్ ఎవిరీవేర్' పాటించకపోతే అందరూ పిచ్చెక్కిపోతారు. ఎదుటివారిని బాధిస్తూ, ఆ కారణంగా పిచ్చివాళ్ళయ్యారు. కుక్కని ఒకసారి ఆటపట్టించండి, రెండుసార్లు మూడుసార్లు నాలుగుసార్లు చేసినా ఊరుకుంటుంది. కానీ మళ్ళీ మళ్ళీ దాన్ని చికాకు పెడుతుంటే అదైనా మనల్ని కొరికిపెడుతుంది. దానికి అర్థమౌతుంది, 'ఈ మనిషి రోజూ నన్ను ఇబ్బంది పెడుతున్నాడు, పనికిరానివాడు, సిగ్గులేనివాడు' అని. ఇది అర్థం చేసుకోవలసిన విషయం. ఏమాత్రం గొడవపడవద్దు. 'అడ్జస్ట్ ఎవిరీవేర్'

ఎవరికైతే 'అడ్జస్ట్' అయ్యే కళ వచ్చేస్తుందో, ఆ మనిషి ప్రపంచం నుంచి 'మోక్షం' వైపుకి తిరుగుతాడు. 'అడ్జస్ట్‌మెంట్' అవటమే జ్ఞానం. ఎవరైతే 'అడ్జస్ట్‌మెంట్' నేర్చుకుంటారో, ఆ వ్యక్తి గట్టెక్కినట్లే. అనుభవించాల్సిందే ఏదైతే ఉందో దాన్ని అనుభవించి తీరవలసిందే. కానీ 'అడ్జస్ట్‌మెంట్' వచ్చినవారికి కష్టం అనేది ఉండదు. లెక్కలు పరిష్కరించబడతాయి. ఎప్పుడైనా దోపిడీ చేసేవాళ్ళు ఎదురైతే, అతనితో డిస్అడ్జెస్ట్ అయితే అతను కొడతాడు. దానికి బదులు మనం అతనితో 'అడ్జస్ట్' అవాలి అని నిర్ణయించుకుని పని వెళ్ళదీసుకోవాలి. అతనితో, 'భాయ్ నీకేం కావాలి? మేమైతే యాత్ర చేయటానికి వచ్చాం' (ఈ విధంగా) మాట్లాడి 'అడ్జస్ట్' అవాలి.

భార్య వంటచేస్తుంది, అందులో మీరు తప్పులెంచితే అది బ్లండర్ అవుతుంది. అలా తప్పులెంచి చూపించవద్దు. తాను ఎప్పుడూ తప్పులు చెయ్యలేదన్నట్లుగా మాట్లాడుతారు. హౌ టు అడ్జస్ట్? అడ్జస్ట్ అవాలి. జీవితాంతం కలిసి బ్రతకాల్సినవారితో అడ్జస్ట్‌మెంటు చేసుకోవద్దా? మీవలన ఎవరికైనా బాధ కలిగితే దాన్ని మహావీర్ మతమని ఎలా అనగలరు? మరి ఇంట్లో మనుషులకైతే ఎప్పుడూ బాధ కలిగించనేగూడదు.

## ఇల్లు ఒక తోట

ఒకతను నాతో అన్నాడు, 'దాదాజీ, నా భార్య ఇంట్లో ఇలా చేస్తుంది, అలా చేస్తుంది' అంటూ. అప్పుడు నేను అతనితో అన్నాను, నీ భార్యని అడిగితే ఆమె ఏమంటుంది? 'నా భర్తకి తెలివి తక్కువ' అని. ఇందులో మీరు కేవలం మీ కోసమే న్యాయం ఎందుకు వెతుకుతారు? అంటే, అతను, 'నా ఇంట్లో అంతా చెడిపోయింది. పిల్లలు చెడిపోయారు, భార్య చెడిపోయింది' అన్నాడు. దానికి నేను, 'ఏమీ చెడిపోలేదు' అన్నాను. మీకు దాన్ని చూడటం రాలేదు. మీకు మీ ఇంటిని 'చూడటం' రావాలి. అందరి మనస్తత్వాలను గుర్తించటం రావాలి

ఇంట్లో అడ్జస్ట్‌మెంట్ అవకపోతే అందుకు కారణం ఏమిటి? కుటుంబ సభ్యులు ఎక్కువమంది ఉంటే, వాళ్ళందరి మధ్య సామరస్యం కుదరదు. ప్రతి మాటకీ అపార్థాలు మొదలౌతాయి. ఎందుకని? మనుషులందరి స్వభావం ఒకేలా ఉండదు కనుక. యుగాన్నిబట్టే స్వభావాలు మారుతాయి. సత్యయుగంలో పరస్పర అనురాగాలు ఉండేవి. ఇంట్లో వందమంది కుటుంబ సభ్యులున్నా, అందరూ తాతగారు చెప్పినట్లుగా నడుచుకునేవారు. ఇప్పుడు ఈ కలియుగంలో, తాతయ్య ఏమైనా చెప్తే అతన్నే పెద్దగా తిట్టిపోస్తారు. తండ్రి ఏమైనా అంటే తండ్రిని కూడా తిట్టేస్తారు.

ఇక మనుషులైతే మనుషులే కదా. కానీ మీకు వాళ్ళని గుర్తించటమే రాలేదు. ఇంట్లో యాభైమంది ఉన్నాకానీ, మీకు గుర్తించటం రాలేదు. అందుకే కలుగజేసుకోవటం జరుగుతుంది. వాళ్ళని గుర్తించాలి కదా! ఇంట్లో ఒక వ్యక్తి

జగడం పెట్టుకుంటూవుంటే, అది అతని స్వభావమే. కాబట్టి మీరు మొదటిసారే అర్థం చేసుకోవాలి 'అతను అంతే' అని. ఇక ఆ తర్వాత మరోసారి అతన్ని గురించి శోధించాల్సిన అవసరమేమిటి? గుర్తించిన తర్వాత శోధించవలసిన అవసరం ఏమీ ఉండదు. కొందరికి రాత్రి ఆలస్యంగా పడుకునే అలవాటు ఉంటుంది, కొందరికి త్వరగా పడుకునే అలవాటు ఉంటుంది. ఇక ఆ ఇద్దరి మధ్య పొంతన ఎలా ఉంటుంది? కుటుంబ సభ్యులంతా కలిసి ఉంటే ఏం జరుగుతుంది? ఒక వ్యక్తి, 'మీకు తెలివితక్కువ' అనేవాడు ఉంటే, అతను అలాగే మాట్లాడుతాడు అని మీరు అర్థం చేసుకోవాలి. అందువలన మీరు అడ్జస్ట్ అయిపోవాలి. దానిబదులు మీరు అతనికి జవాబిస్తుంటే అలసిపోతారు. ఎందుకంటే అతను మీతో తలపడతాడు, కాని మీరు కూడా అతనితో తలపడతారు. అప్పుడు మీకు కూడా కళ్ళు లేవని నిరూపణ అవుతుంది కదా. నేను చెప్పేదేమిటంటే, 'ప్రకృతి సైన్స్‌ని అర్థం చేసుకో'. ఇక పోతే ఆత్మ అనేది వేరు.

## తోటలోని పువ్వుల రంగు, వాసన వేరువేరు

మీ ఇల్లు ఒక పూలతోట. సత్యయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగాలలో ఇళ్ళు పంట పొలాలలా ఉండేవి. ఒకరి పొలంలో కేవలం గులాబీ పువ్వులు పూస్తే, మరో పొలంలో చంపా పువ్వు పూసేది. ఇప్పుడు ఇల్లే ఒక పువ్వుల తోటలా తయారైంది. కాబట్టి మనం పరీక్షించి చూడనక్కర్లేదు ఇది మోగ్రా పువ్వా లేక గులాబీయా అని. సత్యయుగంలో ఒక ఇంట్లో గులాబి ఉంటే, అందరూ గులాబే. మరో ఇంట్లో మోగ్రా పువ్వుంటే అందరూ మోగ్రా పువ్వే. ఒక కుటుంబంలో అందరూ గులాబీ మొక్కే అయితే అది ఒక పొలం లాంటిదౌతుంది. అందువలన ఏ బాధా ఉండేది కాదు. కాని ఇప్పుడు పూలతోటైపోయింది. ఒకే ఇంట్లో ఒకరు గులాబీలా మరొకరు మోగ్రాలా. అందువలన గులాబి అరిచి చెప్తుంది, 'నువ్వు నాలా ఎందుకు లేవు? నీ రంగు చూడు తెల్లగా పాలిపోయి వుంది. నా రంగు చూడు ఎంత అందంగా ఉందో' అని. అప్పుడు మోగ్రా అంటుంది, 'నీలో అన్నీ ముళ్లే కదా' అని. మరి, గులాబి అయినప్పుడు ముళ్ళు ఉంటాయి కదా. మోగ్రా రంగు తెల్లగా ఉంటే, గులాబి రంగు గులాబీ లేక ఎరుపు రంగులో ఉంటుంది.

ఈ కలియుగంలో ఒకే ఇంట్లో వేరు వేరు రకాల పూవులుంటాయి. అంటే ఇల్లు పువ్వుల తోట అయింది. కానీ, చూడటమే చేతకాకపోతే ఏం జరుగుతుంది? బాధే మిగులుతుంది కదా. దీన్ని చూసే దృష్టి జగత్తుకి లేదు. అంతే ఇంకేమీ చెడు లేదు. అభిప్రాయ భేదాలనేవి మీమీ అహంకారాల వలన వస్తాయి. చూడటం చేతకాకపోతే అహంకారం ఉంటుంది. నాలో అహంకారం లేదు కనుక, నాకు ప్రపంచంలో ఎవరితోను భేదాభిప్రాయం లేదు. నేను చూడగలను ఇది 'గులాబి', ఇది 'మోగ్రా', ఇది 'ధతూరా', ఇది 'కుందూ' పువ్వు అని. అలా నేను అన్నిటినీ గుర్తుపడతాను. అంటే పూల తోటయింది. ఇది మెచ్చుకోవలసిన విషయమే కదా? మీకేమనిపిస్తుంది?

**ప్రశ్నకర్త :** నిజమే.

**దాదాశ్రీ :** ఏంటంటే, ప్రకృతి మారదు. ఎక్కడుండే సరుకు అక్కడే, అది మారదు. నేను ప్రతి ఒక్కరి ప్రకృతిని అర్థం చేసుకున్నాను కనుకనే వెంటనే గుర్తుపడతాను. అందువలన నేను ప్రతి ఒక్కరితోను వారి ప్రకృతికి అనుగుణంగా ఉంటాను. మనం సూర్యుడితో పట్టపగలు పన్నెండు గంటలకి జతకడితే ఏమౌతుంది? అలా మనం అర్థం చేసుకోవాలి ఇతను గ్రీష్మ ఋతువులోని సూర్యుడు, ఇతను ఆకురాలు కాలంలోని సూర్యుడు, అలా అందరినీ అర్థం చేసుకుంటే ఇక కష్టమేముంటుంది?

నేను ప్రకృతిని గుర్తించాను కనుక, మీరు నాతో ఢీకొనదలచుకున్నా నేను అలా చేయనివ్వను. నేను జారిపోతాను. లేకపోతే మనిద్దరి యాక్సిడెంట్ అయిపోయి, ఇద్దరి స్పేర్ పార్ట్‌లూ పగలిపోతాయి. ఒకరిది బంపర్ పగిలితే ఆ లోపల కూర్చున్న మనిషి గతి ఏమౌతుంది? కూర్చున్నవానిది దుర్దశే కదా. అందువలన ప్రకృతిని గుర్తించు. ఇంట్లో వాళ్ళందరి ప్రకృతిని గుర్తించాలి.

ఈ కలియుగంలో ప్రకృతి పొలంలా లేదు. తోటలా ఉంది. ఒకరు చంపా, ఒక గులాబీ, మోగ్రా, చమేలీ అలా. అందువలన పువ్వులన్నీ పరస్పరం కొట్టుకుంటూవుంటాయి. ఒకరు నేను ఇలా అంటారు, మరొకరు నేను ఇలా

అంటారు. అప్పుడు ఒకళ్ళంటారు, 'నీలో ముళ్ళున్నాయి, పో ఇక్కడి నుంచి, నీతో ఎవరు కలిసివుంటారు?' అని. అలా జగడాలు నడుస్తూవుంటాయి.

## కౌంటర్‌పులీ మహాత్యం

మనం ముందుగానే ఒక అభిప్రాయాన్ని పెట్టుకునివుండగూడదు. దీన్ని గురించి ఏమనుకుంటున్నారు అని ఎదుటివారిని అడగాలి. ఎదుటివారు తన మాట మీదనో గట్టిగా నిలబడివుంటే, నేను నా ఉద్దేశ్యాన్ని వదిలేస్తాను. నేను చూసేది ఎదుటివారికి ఎలాగైనా సరే బాధ కలిగించగూడదు అని. మన అభిప్రాయాన్ని ఎదుటివారి మీద రుద్దగూడదు. మనం ఎదుటివారి అభిప్రాయాన్ని తీసుకోవాలి. నేను అందరి అభిప్రాయాలనూ తీసుకునే 'జ్ఞాని' ని అయ్యాను. నేను నా అభిప్రాయాన్ని ఎదుటివారిమీద రుద్దటానికి పోతే నేను కూడా పచ్చిగానే ఉండిపోతాను. మన అభిప్రాయంతో ఎవరికీ బాధ కలుగకూడదు.

మీ 'రివొల్యూషన్' పద్ధెనిమిది వందలు, ఎదుటివారిది ఆరు వందలు అయినప్పుడు మీరు మీ అభిప్రాయాన్ని అతనిమీద రుద్దుదామని చూస్తే అతని 'ఇంజన్' పగలిపోతుంది. అతని గేర్లన్నిటినీ మార్చాల్సివస్తుంది.

**ప్రశ్నకర్త :** రివొల్యూషన్ అంటే ఏమిటి?

**దాదాశ్రీ :** ఆలోచించే స్పీడు ఉంటుందే అది అందరికీ వేరువేరుగా ఉంటుంది. ఏమైనా సంఘటన జరిగితే మనస్సు ఒక నిమిషంలో ఎన్ని చూపిస్తుందో, అదంతా 'అట్ ఏ టైమ్' చూపిస్తుంది. ఈ పెద్ద పెద్ద ప్రెసిడెంట్లకు ఒక నిమిషంలో పన్నెండు వందలసార్లు 'రివొల్యూషన్స్' తిరుగుతుంటాయి. నాది ఐదువేల సార్లు తిరుగుతుంది. భగవాన్ మహావీర్‌కి లక్ష 'రివొల్యూషన్స్' తిరుగుతుండేవి.

అభిప్రాయ భేదానికి కారణమేమిటి? మీ భార్యది వంద 'రివొల్యూషన్స్', మీది ఐదు వందల 'రివొల్యూషన్స్', మీ ఇద్దరి మధ్య కౌంటర్‌పులీ వేయటం రాకపోయినందువలనే మధ్యలో నిప్పురవ్వలు లేస్తాయి, జగడం వస్తుంది. అర్, ఎప్పుడైనా ఇంజన్ కూడా పగిలిపోవచ్చు. 'రివొల్యూషన్' అంటే అర్థమైందా

మీకు? మీరు ఈ శ్రామికునితో మాట్లాడినప్పుడు మీ మాటలకు అతనికి చేరవు ఎందుకంటే, అతని 'రివొల్యూషన్' యాభై, మీది ఐదు వందలు. ఒక్కొక్కరికి వెయ్యి ఉంటాయి, ఒక్కొక్కరికి పన్నెండు వందలుంటాయి. వారిలో అభివృద్ధి ఎలా ఉంటే, దానికి అనుగుణంగానే 'రివొల్యూషన్స్' ఉంటాయి. మీరు మధ్యలో 'కౌంటర్‌పులీ' వేస్తేనే మీ మాటలు అతనికి అర్థమౌతాయి. 'కౌంటర్ పులీ' అంటే, మధ్యలో పట్టా వేసి మీ రివొల్యూషన్స్‌ని తగ్గించుకోవాలి. నేను ప్రతి వ్యక్తితోను 'కౌంటర్‌పులీ' వేస్తాను. కేవలం అహంకారం లేకుండా ఉంటే చాలు పని జరుగుతుందని అనుకోవద్దు. 'కౌంటర్‌పులీ' ని కూడా ప్రతివారితో వేయవలసి వుంటుంది. ఈ కారణం చేతనే నాకు ఎవరితోనూ అభిప్రాయభేదం ఉండదు కదా! ఈ భాయ్‌కి ఎంత రివొల్యూషన్ అన్నది నాకు తెలుసు. అందువలన దాని ప్రకారమే 'కౌంటర్‌పులీ' వేస్తాను. నేను చిన్నపిల్లలతో కూడా బాగా కలిసిపోతాను. ఎందుకంటే నేను వాళ్ళతో నలభై రివొల్యూషన్స్ చేసుకుని మాట్లాడుతాను. దానివలన నా మాటలు వాళ్ళ వరకు చేరుతాయి. లేకపోతే ఆ 'మెషీన్' పగిలిపోతుంది.

**ప్రశ్నకర్త :** ఎవరైనా, ఎదుటివారి లెవెల్‌కి వస్తేనే మాట్లాడటం కుదురుతుందా?

**దాదాశ్రీ :** ఔను. అతని రివొల్యూషన్‌కి వస్తేనే మాట్లాడటం కుదురుతుంది. మీతో మాట్లాడుతూవుంటే నా రివొల్యూషన్ ఎక్కడి నుండి ఎక్కడికి వచ్చింది! ప్రపంచమంతా తిరిగివస్తుంది. మీకు 'కౌంటర్‌పులీ' వేయటం రాకపోతే, తక్కువ 'రివొల్యూషన్' ఉన్న ఇంజిన్ తప్పేముంది అందులో? తప్పు మీది, 'కౌంటర్‌పులీ' వేయటం రానిది మీకు!

## ఫ్యూజ్ వేయటం నేర్చుకో

ఈ 'మెషీనరీ' ఎలాంటిది అన్నది గుర్తించు చాలు! దాని 'ఫ్యూజ్' పోతే ఏవిధంగా ఫ్యూజ్ వెయ్యాలి. ఎదుటివారి ప్రకృతినిబట్టి 'అడ్జస్ట్' అవటం రావాలి. ఎదుటివారి 'ఫ్యూజ్' పోయినట్లయితే, అప్పుడు కూడా మన అడ్జస్ట్‌మెంట్

ఉంటుంది. కానీ ఎదుటివారి అడ్జస్ట్‌మెంట్ పోతే ఏమౌతుంది? 'ఫ్యూజ్' పోతే గోడకి కొట్టుకోవటం, గుమ్మానికి కొట్టుకోవటం జరుగుతుంది కానీ, వైరు ఊడిపోదు, కనెక్షన్ ఊడిపోదు. అందువలన ఎవరైనా ఫ్యూజ్ వేసినట్లయితే, అంతా చక్కబడుతుంది. లేకపోతే అప్పటివరకు అతను అలా కొట్టుకుంటూనే వుంటాడు.

## జీవితం చిన్నది, ఉత్పాతాలు ఎక్కువ

అన్నిటికన్నా బాధ కలిగించేది ఏమిటి? 'డిస్‌అడ్జెస్ట్‌మెంట్'. అక్కడ 'అడ్జస్ట్ ఎవిరీవేర్' పాటిస్తే ఏం పోతుంది?

**ప్రశ్నకర్త :** అందులో పురుషార్థం అవసరం.

**దాదాశ్రీ :** ఏ పురుషార్థమూ అవసరం లేదు. నా ఆజ్ఞాపాలన చేసి, దాదాజీ ఇలా అన్నారు కదా, 'అడ్జస్ట్ ఎవిరీవేర్' అని అనుకుంటే 'అడ్జస్ట్' అయిపోతుంటుంది. భార్య, 'నువ్వు దొంగవి' అంటే, 'యు ఆర్ కరెక్ట్' అనండి. భార్య నూటయాభై రూపాయల చీర తెమ్మని కోరితే, మీరు యాభై రూపాయలు ఎక్కువ ఇస్తే, ఇక ఆరు నెలల వరకు సజావుగా నడుస్తుంది.

ఏమిటంటే, బ్రహ్మకి ఒక రోజు అంటే మన పూర్తి జీవితకాలం. బ్రహ్మ దృష్టిలో ఒక రోజున్న జీవితంలో ఎందుకీ ఉపద్రవాలు? మనమేగనక బ్రహ్మదేవుని వంద సంవత్సరాలు జీవిస్తే అప్పుడు అనుకోవచ్చు, ఎందుకీ 'అడ్జస్ట్‌మెంట్' అని. 'దావా వేసుకో' అంటాం. కానీ దీన్ని త్వరగా అవగొట్టాలి. మరి ఏం చెయ్యాలి అప్పుడు? పనిని త్వరగా అవగొట్టాలంటే ఏం చెయ్యాలి? 'అడ్జస్ట్' అవుతారా లేక 'దావా వేసుకో' అంటారా? కాని ఇది ఒక్కరోజే. దీన్ని త్వరగా అవగొట్టాలి. ఏ పనినైతే త్వరగా ముగించాలో దానికి ఏం చెయ్యాల్సివుంటుంది? 'అడ్జస్ట్' అయ్యి చిన్నగా చెయ్యాలి. లేకపోతే పెరిగిపోతుంటుంది కదా? భార్యతో దెబ్బలాడిన తర్వాత రాత్రి నిద్రపడుతుందా? పొద్దున్న మంచి అల్పాహారం కూడా దొరకదు.

## జ్ఞాని జ్ఞానకళని నీ సొంతం చేసుకో

ఏ రోజైనా వైఫ్, 'నాకు ఆ చీర కొనపెట్టరా? ఆ చీర కొనిపెట్టాల్సిందే' అని అంటే అప్పుడు భర్త అంటాడు, 'నువ్వు ఎంత ఖరీదైన చీర చూసావు?" అని. దానికి ఆమె, 'ఇరవైరెండు వందల రూపాయలు. ఎక్కువేం కాదు' అంటుంది. అప్పుడతను, 'నువ్వు ఇరవై రెండు వందలు అంటున్నావు, డబ్బులు ఎక్కడి నుంచి తేను? ఇప్పుడు ఆ డబ్బులు ఏర్పాటు అవవు. రెండు వందలో మూడు వందలో అయితే ఇప్పించివుండేవాడిని కాని, నువ్వు ఇరవై రెండు వందలు అంటున్నావు' అంటాడు. ఆమె అలిగి కూర్చుంటుంది. అప్పుడెలాంటి పరిస్థితి ఉంటుంది? మనసులో, 'అరె, ఈమెని పెళ్ళి చేసుకోకపోయినా బావుండేది' అనే ఆలోచన కూడా వస్తుంది. పెళ్ళి చేసుకున్న తర్వాత పశ్చాత్తాప పడితే ఏం లాభం? అంటే ఇలాంటి బాధలుంటాయన్నమాట.

**ప్రశ్నకర్త :** మీరనేదేమిటి, భార్యకి ఇరవై రెండు వందల రూపాయల చీర కొనిపెట్టాలంటారా?

**దాదాశ్రీ :** కొనిపెట్టాలా వద్దా అన్నది మీ మీద ఆధారపడివుంది. అలిగి రోజూ రాత్రిపూట, 'వంట చెయ్యను' అంటే, అప్పుడు మీరేం చేస్తారు? వంట మనిషిని ఎక్కడి నుండి తీసుకునివస్తారు? ఇక అప్పు చేసైనా చీర కొనిపెట్టవలసిందే కదా?

ఆమె తనంతట తాను కూడా చీర కొనితెచ్చుకోకుండా ఉండాలంటే ఇలా చెయ్యవచ్చు. మీకు నెలకి ఎనిమిది వేల రూపాయలు వస్తున్నట్లయితే, అందులో ఒక వెయ్యి రూపాయలను మీ జేబు ఖర్చులకు ఉంచుకుని, ఏడు వేల రూపాయలు ఆమె చేతికివ్వండి. ఇక ఆమె మనల్ని అడుగుతుందా చీర కొనిపెట్టమని? పైగా మీరు హాస్యమాడటానికి, 'ఆ చీర చాల బావుంటుంది కదా, ఎందుకు కొనితేవటం లేదు?' అనవచ్చు. దాని ఏర్పాటు ఆమెకి స్వయంగా చేసుకోవలసివుంటుంది. ఏర్పాటు చేసే పని మనదైనప్పుడు మన మీద జోరు

పెంచుతుంది. ఈ కళంతా నేను 'జ్ఞాని' అవటానికి ముందే నేర్చుకున్నాను. ఆ తర్వాతే 'జ్ఞాని' అయ్యాను. అన్ని రకాల కళలు వచ్చిన తర్వాతనే నాకు 'జ్ఞానం' లభించింది. ఇప్పుడు చెప్పండి, ఇది కళ లేకపోవటం వలనే కదా బాధలన్నీ కలిగేవి! మీకేమనిపిస్తోంది?

**ప్రశ్నకర్త :** ఔను. నిజమే.

**దాదాశ్రీ :** ఇది మీకు అర్థమైందా? ఇందులో తప్పు మనదే కదా? దీనివలనే కళ వస్తుంది కదా! కళ నేర్చుకునే అవసరం ఉంది.

## క్లేశాలకు మూల కారణం- అజ్ఞానత

**ప్రశ్నకర్త :** కానీ, క్లేశాలు ఏర్పడటానికి కారణం ఏమిటి? స్వభావం కలవక పోవటం వలనా?

**దాదాశ్రీ :** అజ్ఞానం వలన. ప్రపంచం అంటే అర్థమే 'ఒకరి స్వభావం మరొకరితో కలవనే కలవదు' అని. ఈ జ్ఞానం కలిగిన వాళ్ళకి ఒకటే మార్గం, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'! ఎవరైనా మిమ్మల్ని కొట్టినప్పటికీ మీరు అతనితో 'అడ్జస్ట్' అవాలి.

నేను ఈ సరళమైన, తిన్నని మార్గాన్ని చెప్తాను. ఈ జగడాలు ప్రతిరోజు జరుగుతుంటాయా? అవి కేవలం కర్మ ఉదయించినపుడే అవుతాయి. ఆ సమయంలో మనం అడ్జస్ట్ అయిపోవాలి. ఇంట్లో భార్యతో జగడమైనట్లయితే, ఆ తర్వాత ఆమెని హోటల్‌కి తీసుకెళ్ళి, అక్కడేమైనా తినిపించి ఆమెని సంతోషపెట్టండి. ఇక *తంతము* (టెన్షన్) ఉండగూడదు.

## దాదాజీ సంపూర్ణంగా- అడ్జస్టబుల్

ఒకసారి కడీ (మజ్జిగ పులుసు) బాగా కుదిరింది కాని కాస్త ఉప్పు ఎక్కువైంది. అందులో నాకు ఉప్పు ఎక్కువనే అనిపించింది కాని కొద్దిగైనా తినాలి కదా! అందువలన హీరాబా (దాదాజీ భార్య) లోపలికి వెళ్ళినపుడు, నేను అందులో కాస్త నీళ్ళు కలిపాను. ఆమె అది చూసి అన్నది, 'ఏం చేస్తున్నారు?' అని. 'నువ్వు

పొయి మీద పెట్టి నీళ్ళు పోస్తావు, నేను కింద పెట్టి పోసా' అన్నాను. అప్పుడామె, 'కానీ నేను నీళ్ళు పోసి మరిగిస్తాను' అన్నది. 'నాకు రెండూ సమానమే' అన్నాను నేను. నాకు పని జరగటం ముఖ్యం కదా.

పదకొండు గంటలకు ఆమె నాతో, 'మీరు భోజనం చెయ్యాలి' అంటే, నేను, 'కొంచెం సేపు ఆగి తింటే పరవాలేదా?' అంటాను. అప్పుడామె, 'లేదు, భోజనం చేసేస్తే పనైపోతుంది' అని అంటే, నేను వెంటనే భోజనం చెయ్యటానికి కూర్చుంటాను. నేను ఆమెతో 'అడ్జస్ట్' అయిపోతాను.

పళ్ళెంలోకి వచ్చినదాని తినేయండి. మీ ముందుకు రావటం సంయోగం వలనే. భగవాన్ ఇలా అన్నారు, 'సంయోగాన్ని వెనక్కి నెట్టేస్తే, అది మళ్ళీ నిన్ను నెట్టేస్తుంది'. అందువలన మన పళ్ళెంలోకి వచ్చింది మనకి నచ్చకపోతే, అటువంటి పదార్థాలు పెట్టినప్పటికీ, అందులోంచి రెండు మూడు తీసుకుని తినేస్తాను. అలా చెయ్యకపోతే జగడం రెండిటితో వస్తుంది. ఒకటి, అది వండినవారితో జగడం, తిరస్కారం, రెండవది ఆ ఆహారపదార్థంతో. 'నేనేం తప్పు చేసాను? నేను నీ దగ్గరకు వచ్చాను. నువ్వు నన్ను ఎందుకు అవమానిస్తున్నావు? నీకు ఎంత బాగుంటే అంతే తీసుకో కానీ నన్ను అవమానించకు' అంటుంది ఆ ఆహారపదార్థం. దాన్ని గౌరవించవద్దా? నేనైతే ఎవరైనా నాకు ఇష్టం లేని పదార్థాన్ని ఇచ్చినా నేను దానికి గౌరవమిస్తాను. ఎందుకంటే, ఏదీ అలా ఒట్టిగా లభించదు. ఒకవేళ లభిస్తే దాన్ని గౌరవించాలి. ఎవరైనా మీకు తినటానికి పెట్టారనుకోండి, మీరు దానిలో వంక చూపిస్తే, దాని వలన సౌఖ్యం పెరుగుతుందా, తరుగుతుందా? ఏం చెయ్యటం వలన సౌఖ్యం తగ్గిపోతుందో, ఆ వ్యాపారమే చెయ్యగూడదు కదా! చాలసార్లు కూర రుచి నాకు సహించదు. అయినా తినేస్తాను. పైగా మెచ్చుకుంటాను కూడా, ఈరోజు కూర చాల బాగా కుదిరింది అంటూ. అరె, చాలసార్లు టీలో పంచదారే ఉండదు. అయినా నేను ఏమీ అనలేదు. అప్పుడు నన్ను అందరూ అనేవారు, 'అలా చేస్తే ఇంట్లో అంతా చెడిపోతుంది' అని. 'మీరు రేపు చూస్తారు ఏమౌతుందో!' అన్నాను. మరి రెండవ రోజు ఆమె (హీరాబా), 'నిన్న టీలో పంచదార లేదు. అయినా మీరు నాకు ఏమీ చెప్పలేదు' అంది.

అప్పుడు నేనన్నాను, 'నేను చెప్పవలసిన అవసరం ఏముంది? మీకు తెలిసిపోతుంది కదా! మీరు తాగకపోతే నేను చెప్పవలసిన అవసరం పడేది. మీరు తాగుతారు కదా ఇక నేను చెప్పవలసిన అవసరం ఏమిటి'?

**ప్రశ్నకర్త :** కానీ, ప్రతి క్షణం ఎంత జాగృతిలో ఉండాల్సివస్తుంది!

**దాదాశ్రీ :** ప్రతి క్షణం, 24 గంటలు జాగృతి, ఆ తర్వాతనే ఈ 'జ్ఞానం' ప్రారంభమైంది. దాని అర్థం, అంతకు ముందు నుంచే అన్ని విధాల 'అడ్జస్టెమెంట్' చేసుకోవటం జరిగింది. సాధ్యమైనంత వరకు అప్పటి వరకు క్లేశాలు రానివ్వలేదు.

ఒకసారి నేను స్నానానికి పోయినపుడు, గ్లాసు (మగ్) పెట్టటం మర్చిపోవటం జరిగింది. అడ్జస్ట్‌మెంట్ చేసుకోలేకపోతే నేను జ్ఞానినెలా అవుతాను? నేను అడ్జస్ట్ చేసుకుంటాను. చెయిపెట్టి చూస్తే నీళ్ళు చాల వేడిగా ఉన్నాయి. ట్యాప్ తిప్పితే ట్యాంక్ ఖాళీ. ఇక నేను నెమ్మది నెమ్మదిగా చేతులతో నీటిలో తపతపా కొడుతూ చల్లగా చెస్తూ స్నానం చేసాను. మహాత్మాలందరూ, 'ఈ రోజు దాదాజీ కి స్నానం చెయ్యటానికి చాలసేపు పట్టింది' అన్నారు. ఏం చెయ్యను? నీళ్ళు చల్లగా అయితే కదా? నేను ఎవరితోనూ, 'అది ఇవ్వు, ఇది ఇవ్వు' అని అడగను. అడ్జస్ట్ అయిపోతాను. అడ్జస్ట్ అవటమే ధర్మం. ఈ ప్రపంచంలో ప్లస్ మైనస్ అడ్జస్ట్‌మెంట్ చేసుకోవటం అవసరం. మైనస్ ఉన్న చోట ప్లస్, ప్లస్ ఉన్నచోట మైనస్ చేసుకోవలసివుంటుంది. ఎవరైనా నా ఈ అవగాహనను కూడా పిచ్చితనం అంటే నేను, 'ఔను నిజమే' అంటాను. అతన్ని మైనస్ చేసేస్తాను.

ఎవరికైనా అడ్జస్ట్ అవటం రాకపోతే, ఆ మనిషిని మనిషి అని ఎలా అంటాము? సంయోగానికి అనుగుణంగా అడ్జస్ట్ అయిపోతే ఆ ఇంట్లో గొడవలే జరగవు. నేను కూడా హీరాబాతో అడ్జస్ట్ అవుతూ వచ్చాను కదా. వాళ్ళ వలన లాభం పొందాలంటే అడ్జస్ట్ అవాలి. ప్రయోజనం ఉండదు సరికదా వైరబంధం ఏర్పడుతుంది ఇంకా. ఎందుకంటే, ప్రతి జీవి స్వతంత్ర్యం కలిగినదే, స్వయంగా సుఖాన్ని వెతుక్కుంటూ వచ్చినదే కాని, ఇతరులకు సుఖాన్నివ్వటానికి రాలేదు.

మరి ఆ జీవికి సుఖానికి బదులు దు:ఖం కలిగితే వైరబంధం ఏర్పడుతుంది కదా, వాళ్ళు భార్యే కాని లేక కొడుకే కాని!

**ప్రశ్నకర్త:** సుఖాన్ని వెతుక్కుంటూ వచ్చి దు:ఖాన్ని పొందితే వైరబంధం ఏర్పడుతుందా?

**దాదాశ్రీ:** ఔను వాళ్ళు సోదరుడే కాని లేక తండ్రే కాని, దానివలన లోలోపలే వైరబంధం ఏర్పడుతుంది. ఈ ప్రపంచమంతా అంతే, వైరమే ఏర్పడుతుంది. స్వధర్మంలో ఎవరితోనూ వైరం ఉండదు.

ప్రతి మనిషికీ జీవితంలో కొన్ని ప్రిన్సిపుల్స్ (సిద్ధాంతాలు) అయితే ఉండవలసిందే. అయినా, సంయోగాన్నిబట్టి ప్రవర్తించాలి. సంయోగంతో అడ్జస్ట్ అయినవాళ్ళనే మనిషి అనబడతాడు. ప్రతి సంయోగంలోను అడ్జస్ట్ అవటం వచ్చినట్లయితే అది ఎంతో అద్భుతమైన ఆయుధమంటే, అది పూర్తిగా మోక్షంలోకి తీసుకునివెళ్తుంది.

ఈ దాదాజీ తెలివైనవారు, పొదుపు కలిగినవారు, ఉదార స్వభావులు కూడా. సంపూర్ణంగా ఉదారులు. అయినా 'కంప్లీట్ అడ్జస్టబుల్'. ఇతరుల కోసం ఉదారులు, తన కోసం పొదుపు, ఉపదేశమివ్వటంలో సూక్ష్మబుద్ధి. అందుకే ఎదుటివారికి నా వ్యవహారం ఎంతో సూక్ష్మబుద్ధిగా కనిపిస్తుంది. నా ఎకానమీ అడ్జస్టబుల్ గా ఉంటుంది, టాప్‌మోస్ట్ గా ఉంటుంది. నేను నీటిని కూడా పొదుపుగా ఉపయోగిస్తాను. నా ప్రాకృతిక గుణం సహజ భావంతో కూడి వుంటుంది.

## లేదంటే వ్యవహారపు చిక్కుముడి అడ్డుపడుతుంది

ముందుగా వ్యవహారం నేర్చుకోవాలి. వ్యవహారజ్ఞానం లేకపోతే మనుషులు రకరకాలుగా దెబ్బతింటారు.

**ప్రశ్నకర్త:** ఆధ్యాత్మిక విషయాల మీద మీ మాటల గురించి ఏం చెప్పాలి, కానీ వ్యవహారంలో కూడా మీ మాటలు 'టాప్' గా ఉంటాయి.

**దాదాశ్రీ :** అసలు సంగతేమిటంటే, వ్యవహారంలో 'టాప్' అవగాహన లేకుండా ఎవరూ మోక్షంలోకి వెళ్ళలేదు. ఎంత విలువైన పన్నెండు లక్షల రూపాయల ఆత్మజ్ఞానం ఉన్నప్పటికీ వ్యవహారం వదిలేస్తుందా? అది మిమ్మల్ని వదలకపోతే మీరేం చేస్తారు? మీరు శుద్ధాత్మ నిజమే కానీ వ్యవహారం వదిలిపెడితే కదా. మీరు వ్యవహారాన్ని చిక్కులు పెట్టుకుంటారు. టకటకా పరిష్కారం వెతికి పట్టుకుని రండి మరి.

ఈయనతో మీరు, 'వెళ్ళి దుకాణం నుంచి ఐస్‌క్రీం తీసుకునిరా' అంటే సగం దారి నుంచే వెనక్కి తిరిగి వచ్చేస్తాడు. 'ఎందుకు?' అని అడిగితే, 'దారిలో గాడిద ఎదురైంది, అపశకునం అయింది!' అంటాడు. ఇతనికి అలా ఉల్టా జ్ఞానం వచ్చిందంటే నేను దాన్ని తీసివేయాలి కదా? అతనికి అర్థమయ్యేటట్లుగా చెప్పాలి, 'భాయ్, గాడిదలో భగవాన్ విరాజమానులైవున్నారు. అందువలన ఎటువంటి అపశకునమూ లేదు. నువ్వు గాడిదను తిరస్కార భావంతో చూస్తే అది దాని లోపల ఉన్న భగవాన్‌కి చేరుతుంది. అందుకు నీకు పెద్ద దోషం అంటుకుంటుంది. మళ్ళెప్పుడూ అలా చెయ్యకు' అని చెప్పాలి కదా. ఇలాంటి ఉల్టా జ్ఞానం కారణంగానే మనుషులు అడ్జస్ట్ అవలేకపోతున్నారు.

## ఉల్టా ఉన్నదాన్ని సరిచేయి, అదే సమకితం

సమకితి కి గుర్తు ఏమిటి? అదేమిటంటే, ఇంట్లోవాళ్ళు ఏం ఉల్టా చేసినా దాన్ని సరిచేస్తాడు. ప్రతి ఒక్క మాటని తిన్నగా చెప్తాడు. ఇది సమకితికి గుర్తు. నేను ఈ ప్రపంచంలో ఎంతో శోధించాను. అంతిమ శోధన తర్వాత నేను ఈ మాటలన్నిటినీ చెప్తున్నాను. వ్యవహారంలో ఎలా ఉండాలి అన్నది కూడా చెప్తాను, మోక్షంలో ఎలా వెళ్ళవచ్చు అన్నది కూడా చెప్తాను. మీ అడ్డంకులు ఎలా తగ్గిపోతాయి అన్నదే నా ఉద్దేశ్యం.

మన మాటలు ఎదుటివారికి 'అడ్జస్ట్' అవాలి. మన మాటలు ఎదుటివారికి 'అడ్జస్ట్' అవకపోతే అది మన తప్పే. ఆ తప్పుని సరిచేసుకుంటే మన మాటలు 'అడ్జస్ట్' అవుతాయి. వీతరాగుల మాటలు 'ఎవిరీవేర్ అడ్జస్ట్‌మెంట్' అయ్యేవే అవుతాయి.

**ప్రశ్నకర్త :** దాదాజీ, మీరు చెప్పిన 'అడ్జస్ట్ ఎవిరీవేర్' తో ఎలాంటి వారినైనా చిక్కుల్లోంచి బయటపడేస్తుంది.

**దాదాశ్రీ :** అందరికీ పరిష్కారం దొరుకుతుంది. నా ఈ ఒక్కో పదం, అందరికీ త్వరగా పరిష్కారం తీసుకునివస్తుంది. వాళ్ళని టకటకా మోక్షానికి తీసుకెళ్తుంది. అందుకే, 'అడ్జస్ట్ ఎవిరీవేర్'.

**ప్రశ్నకర్త:** ఇప్పటివరకూ ఎక్కడ మనసుకి నచ్చుతుంటే అక్కడ అందరూ అడ్జస్ట్ అవుతూవస్తున్నారు. ఇక మీ మాటలతో ఏమనిపిస్తుందంటే, 'ఎక్కడ మనసుకి నచ్చదో అక్కడ నువ్వు ముందు అడ్జస్ట్ అవాలి'.

**దాదాశ్రీ :** 'ఎవిరీవేర్ అడ్జస్ట్' అవాలి.

## దాదాజీ అద్భుతమైన విజ్ఞానం

**ప్రశ్నకర్త :** 'అడ్జస్ట్‌మెంట్' అనే మాట ఏదైతే ఉందో, దాని వెనక భావం ఏమిటి? 'అడ్జస్ట్‌మెంట్' ఎంతవరకు చేసుకోవాలి?

**దాదాశ్రీ :** భావం శాంతిది. కారణం శాంతిది. అశాంతి పుట్టకుండా ఉండటానికి ఉపాయం. దాదాజీ విజ్ఞానం 'అడ్జస్ట్‌మెంట్' ది. అద్భుతమైన 'అడ్జస్ట్‌మెంట్' ఇది. ఎక్కడ 'అడ్జస్ట్' అవరో, అక్కడ మీకు దాని రుచి తగిలుతూనే ఉంటుంది కదా? 'డిస్‌అడ్జస్ట్‌మెంటు' మూర్ఖత్వం. 'అడ్జస్ట్‌మెంట్' ని నేను న్యాయం అంటాను. ఆగ్రహ దురాగ్రహాలు న్యాయం అనిపించుకోవు. ఏ విధమైన ఆగ్రహమూ న్యాయం అవదు. నేను ఏ మాటను గట్టిగా పట్టుకునివుండను. ఏ నీటిలో పెసలు ఉడుకుతాయో అందులో ఉడికిస్తాను. చివరకు మురుగు కాలువలో నీళ్ళతో కూడా వండుతాను.

ఇంతవరకు ఒక్క వ్యక్తి కూడా నాతో డిస్‌అడ్జస్ట్ అవలేదు. కానీ వీళ్ళు ఇంట్లో నలుగురు మనుషులతో కూడా అడ్జస్ట్ అవలేకపోతున్నారు. అడ్జస్ట్ అవటం ఇప్పుడు వస్తుందా లేదా? అలా జరుగుతుందా లేదా? మనం ఎలా చూస్తే అలా

మనకి వచ్చేస్తుంది కదా? ఈ ప్రపంచంలో నియమం ఏమిటంటే, మీరు ఎలా చూస్తే, అంతైతే మీకు వచ్చేస్తుంది. అందులో ఇక నేర్చుకోవలసింది ఏమీ ఉండదు. ఏం రాదు? నేను కేవలం మీకు ఉపదేశం ఇస్తూనేవుంటే అది రాదు. కానీ మీరు నా ఆచరణను గమనిస్తే సులభంగా వచ్చేస్తుంది.

ఇక్కడేమో ఇంట్లో 'అడ్జస్ట్' అవటమే రాదు కాని, ఆత్మజ్ఞాన శాస్త్రాలు చదవటానికి కూర్చుంటారు! వదిలెయ్యి! ముందు ఇది నేర్చుకో! ఇంట్లో 'అడ్జస్ట్' అవటం రాదు. ఇలా ఉందీ ప్రపంచం.

ప్రపంచంలో వేరే ఏమీ రాకపోయినా, ఏం పరవాలేదు. వ్యవసాయం చేయటం తక్కువగా వస్తే పరవాలేదు కానీ, అడ్జస్ట్ అవటం రావాలి. అంటే, వస్తుస్థితిలో అడ్జస్ట్ అవటం నేర్చుకోవాలి. ఈ కాలంలో అడ్జస్ట్ అవటం రాకపోతే దెబ్బతినిపోతారు. అందుకే 'అడ్జస్ట్ ఎవిరీవేర్' అవుతూ పని నెరవేర్చుకోవాలి.

**-జై సచ్చిదానంద**

# శుద్ధాత్మకి ప్రార్థన

హే అంతర్యామీ పరమాత్మా! నీవు నాలో ఉన్నవిధంగానే జీవులందరిలో విరాజమానమై వున్నావు. నీ యొక్క దివ్య స్వరూపమే నా నిజ స్వరూపము. నా నిజ స్వరూపము పవిత్ర ఆత్మ.

హే శుద్దాత్మ భగవాన్! నేను నీకు అభేదభావముతో అత్యంతభక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను.

అజ్ఞానవశాత్తు నేను చేసిన తప్పులనన్నింటిని ❖ నీ ముందు ఒప్పుకొనుచున్నాను. నేను ఈ తప్పులకు పశ్చాత్తాపం చెందుతూ నీ క్షమకై అర్థిస్తున్నాను. ప్రభూ! దయతో నన్ను క్షమించు, నన్ను క్షమించు, నన్ను క్షమించు. ఆ తప్పులను మరల చేయకుండునట్లు నాకు శక్తిని ప్రసాదించు.

హే శుద్దాత్మ భగవాన్! మాకు నీతోగల భేద భావము తొలగిపోయి మేమందరము నీతో అభేదతను పొందునట్లు ఆశీర్వదించు. మేము సదా నీతో అభేదతతో తన్మయాకారతను చెందెదము గాక!

(❖ గతంలో నీవు చేసిన తప్పులను గుర్తు తెచ్చుకోవాలి)

## ప్రతిక్రమణ : దివ్యమైన క్షమాపణా విధానము

నేను దాదా భగవాన్ సాక్షిగా ❖...................... యొక్క మనోవచన కాయము కంటె పూర్తిగా వేరైన పవిత్రాత్మకు నమస్కరించుచున్నాను.

నేను నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను (ఆలోచన) ❖❖

ఆ తప్పులకై నేను క్షమాపణ కోరుచున్నాను (ప్రతిక్రమణ)

ఆ తప్పులను మరల చేయనని దృఢముగా నిశ్చయించుకొనుచున్నాను (ప్రత్యాఖ్యాన్)

ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! ఈ దృఢ నిశ్చయమును పాలించు శక్తిని నాకు అనుగ్రహించు.

❖ మీ వలన గాయపడిన వ్యక్తి పేరు

❖❖ ఆ వ్యక్తిపట్ల మీరు ఒనర్చిన దోషాలను గుర్తుచేసుకోవాలి.

# తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | |
|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు |
| 2. | విభేదాలను తొలగించడానికి |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది |
| 4. | బాధితుడు తప్పిదము |
| 5. | క్రోధం |
| 6. | చింత |
| 7. | నేను ఎవరు? |
| 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 9. | మృత్యు సమయం దానికి ముందు, దాని తర్వాత... |
| 10. | ఆత్మ సాక్షాత్కారం |
| 11. | మానవ ధర్మం |
| 12. | సేవ, పరోపకారం |
| 13. | ప్రతిక్రమణ |
| 14. | భార్యాభర్తల దివ్య వ్యవహారం |
| 15. | అంతఃకరణ స్వరూపం |
| 16. | పాప-పుణ్యం |
| 17. | తల్లి-తండ్రి, పిల్లల వ్యవహారం |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

❖ దాదా భగవాన్ పుస్తకాలు వివిధ భాషలలో అందుబాటులో ఉన్నాయి. గుజరాతీ, హిందీ, ఇంగ్లీష్, మరాఠీ, తెలుగు, కన్నడ, ఒరియా, మలయాళం, బెంగాలీ, పంజాబీ, అస్సామీ, తమిళం, జర్మన్, స్పానిష్, రష్యన్, మొదలైనవి.

❖ 'దాదావాణి' పత్రిక ప్రతి నెలా మూడు భాషలలో ప్రచురితమవుతుంది : గుజరాతీ, హిందీ & ఇంగ్లీష్.

❖ అన్ని దాదా భగవాన్ పుస్తకాలు మరియు మ్యాగజైన్‌లు ఆన్‌లైన్ పుస్తక దుకాణంలో కూడా అందుబాటులో ఉన్నాయి : https://store.dadabhagwan.org

# దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్




❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.

❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**'Dada Bhagwan Foundation Telugu' Channel:**

https://dbf.adalaj.org/yttelugu






*Open Link OR*

*Scan QR*

---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

## Contact details

### Dada Bhagwan Parivar

**Adalaj:** (Main Center) **Trimandir,** Simandhar City, Ahmedabad-KalolHighway, Post: Adalaj, Dist. Gandhinangar, Gujarat, India - 382421
Phone: +91 79 3500 2100, +91 9328661166/1177
Email: info@dadabhagwan.org

**Mumbai**: **Trimandir,** Rishivan, Kajupada, Borivali (E)
**Phone:** 9323528901

**Pune:** **Trimandir,** Pune-Bengaluru Highway, near Khed-Shivapur, Varve BK, Dist-Pune, Maharashtra
**Phone:** 7203098409

| | | | |
|---|---|---|---|
| **Delhi** | : 9810098564 | **Bengaluru** | : 9590979099 |
| **Kolkata** | : 9830093230 | **Hyderabad** | : 9885058771 |
| **Chennai** | : 7200740000 | **Pune** | : 7218473468 |
| **Jaipur** | : 8890357990 | **Jalandhar** | : 9814063043 |
| **Bhopal** | : 6354602399 | **Chandigadh** | : 9780732237 |
| **Indore** | : 6354602400 | **Kanpur** | : 9452525981 |
| **Raipur** | : 9329644433 | **Sangli** | : 9423870798 |
| **Patna** | : 7352723132 | **Bhuvneshwar** | : 8763073111 |
| **Amravati** | : 9422915064 | **Varanasi** | : 9795228541 |

| | |
|---|---|
| **U.S.A** | : **DBVI Tel.** : +1 877-505-DADA (3232), **Email** : info@us.dadabhagwan.org |
| **U.K.** | : +44 330-111-DADA (3232) |
| **Kenya** | : +254 795-92-DADA (3232) |
| **UAE** | : +971 557316937 |
| **Dubai** | : +971 501364530 |
| **Australia** | : +61 402179706 |
| **New Zealand** | : +64 21 0376434 |
| **Singapore** | : +65 91457800 |

www.dadabhagwan.org



## అడ్జస్ట్ ఎవిరీవేర్

ప్రపంచంలో మరేమీ రాకపోయినా పరవాలేదు కానీ అడ్జస్ట్ అవటం మాత్రం రావాలి. ఎదుటివారు డిజెడ్జెస్ట్ అవనీయండి. కానీ, మీరు మాత్రం అడ్జస్ట్ అవటం వస్తే ఎలాంటి బాధలూ ఉండవు. అందువలన, "అడ్జస్ట్ ఎవిరీవేర్". అందరితోను అడ్జస్ట్‌మెంట్ అయినట్లయితే, అదే అన్నిటికన్నా పెద్ద ధర్మం. ఈ కాలంలో భిన్నభిన్న మనస్తత్వాలున్నాయి. అలాంటప్పుడు అడ్జస్ట్ అవకపోతే ఎలా నడుస్తుంది?

నేను ఈ ప్రపంచాన్ని చాల సూక్ష్మంగా శోధించాను. చివరివరకూ శోధించిన తర్వాతనే నేనీ మాటలన్నీ చెప్తున్నాను. వ్యవహారికంగా ఎలా నడుచుకోవాలి అన్నది కూడా చెప్తాను, మోక్షానికి ఎలా వెళ్ళాలి అన్నది కూడా చెప్తాను. మీకున్న అవరోధాలు ఏవిధంగా తగ్గిపోవాలి అన్నదే నా ఉద్దేశ్యం.

-దాదాశ్రీ




dadabhagwan.org





Printed in India

**Price ₹ 50**